

జూన్ **1979** సంచికతో
అందించబడిన
పూర్తి నవల





# జీవనయాత్ర

## ద్విభాష్యం రాజేశ్వరరావు

# జీవనయాత్ర

"ట్రింగ్.... ట్రింగ్...."

బెల్ మోగుతూ బోర్డుమీద దీపం వెలుగుతోంది.

'హెడ్ ఫోను' చెవులమీదకు లాగుకొని 'కార్డ్' బిగించి అరుణ. తరువాత సున్నితమయిన కంఠంతో "శ్రీ కెమికల్స్ ప్లీజ్" అంది.

"కనెక్ట్ మి టు ఎస్టాబ్లిష్‌మెంట్ ఆఫీసర్!" అవతలినుం ఎవరిదో గొంతు.

కనెక్షన్ ఇచ్చింది అరుణ. అంతలో నే మరో కాల్!

"పర్సనల్ ఆఫీసరు కావాలి!"

"లైన్‌లో వుండండి!" అంటూ పర్సనల్ ఆఫీసర్‌కు రిం చేసింది.

అటు పర్సనల్ ఆఫీసరు గొంతు ఫోనులో ఖంగుమం "సార్! మీకోసం ఎవరో లైన్‌లో వున్నారు. కనెక్ట్ చే మంటారా?"

"నో! మీటింగులో వున్నాను. అయామ్ వెరీ బిజీ! తరువా ఫోన్ చేయమనండి" అంటూ ఫోను పెట్టేశాడాయన.

"దయచేసి మళ్ళీ రింగ్ చేయండి. ఆయన మీటింగుల వున్నారు" అంటూ ఎంతో మెత్తగా చెప్పింది.

అవతలినుండి "చంపేశారు! నా కాయన అర్జెంటు కావాలి!" అన్నాడు.

"సారీ!" అంది అరుణ.

చికాకుగా ఫోను పడేసిన సవ్వడి!

దీర్ఘంగా నిట్టూర్చింది అరుణ!

ఫోన్ జంక్షను బాక్సు ముందు కూర్చున్న ఆరు గంటల్లోనూ యీ వేడి జవాబులు, ఈ నిట్టూర్పులు, ఈ విసుగుదలలూ భరించక తప్పదు.

కనెక్షన్ ఇవ్వటం—కొద్ది క్షణాల్లోనే ఊడదీయటం - అంతా సెకెన్లలో జరిగిపోవాలి. ఏమాత్రం ఆలస్యం జరగకూడదు!

అందరి పిలుపులకూ శాంతంగా సమాధానాలు ఇవ్వాలి. కష్టం కల్గించే సమాధానమయినా తియ్యగా చెప్పాలి.

పదిలైన్ల జంక్షను బాక్సు! అయినా, అన్నిలైన్లూ ఎంగేజ్ లోనే వుంటాయి. పేరుమోసిన కంపెనీ అవటంవలన ఏదో పనిమీద వ్యాపారరీత్యా కాల్స్ వస్తూనే వుంటాయి. ఆఫీసునుండి ప్లాంటుకు, ఇ... వ్యాపార ఏజెన్సీలకూ వెళ్తూనే వుంటాయి. ఈ కాల్స్ కాక పైవూర్లనుండి ఇక్కడ తయారయ్యే రసాయనాలకోసం వచ్చే ఆర్డరు టెలిగ్రాములు. వాటిని అందుకొని టైపుచేసి ప్లాంటుకు పంపించాలి. సాయంకాలం తను కుర్చీనుండి లేచేలోగా అవి టైపు అయిపోవాలి. సాయంకాలం 'వేన్' వాటిని తీసుకువెళ్ళి కొత్త ఆవలవున్న ప్లాంటులో అందజేస్తుంది. వాటినిబట్టి అక్కడినుండి కెమికల్స్ పేక్‌చేసి పంపిస్తారు. వచ్చినప్పటినుండి వెళ్ళేంతవరకూ ఊపిరి తిరగనంత పని!

"ట్రింగ్!....ట్రింగ్!...."

"శ్రీ కెమికల్స్ ప్లీజ్!" మార్దవం ఉట్టిపడే గొంతుతో అంది అరుణ.

"ఆకాశవాణి ఆఫీసేనా?" అవతలిగొంతు గట్టిగా అరుస్తోంది. చెవులు చిల్లులు పడిపోతున్నాయి.

"రాంగ్ నంబర్ ప్లీజ్!" అంది.

"ఆ! రామారావునే మాట్లాడుతున్నాను. కోడిపిల్లల పెంపకం గురించి నేను వ్రాసి పంపిన వ్యాసం ప్రసారణకు అంగీకార మయిందో లేదో తెల్సుకుందామని...."

"సారీ! ఇది ఆకాశవాణి కాదు!"

"అంగీకరించబడలేదా? అయితే, తిప్పి పంపుటకు నేను

కవరు జతపరిచేను, ఇంతవరకూ త్రిప్పి పంపలేదేం. మరి....?"

అరుణకు చికాకువేసి డిస్కనెక్టు చేసేసింది.

ఉన్న తలనొప్పి, పనిచాలక యీ రాంగ్ నంబర్లు ఒకటి! వాళ్ళధోరణి వాళ్ళదేకాని ఇవతలి వాళ్ళు చెప్పేది వినిపించుకోరు.

అరుణ రుమాలుతో ముఖం అద్దుకొని ఎదురుగా చూపింది. గోడ గడియారం మూడున్నర చూపిస్తోంది. ఇంకా అరగంటసేపు బోర్డుముందు కూర్చోవాలి. కాస్త వీలుదొరికితే టెలిగ్రాములు టైపు చేయాలి.

ప్రక్కనున్న టైపు మిషను వంక చూసి నిట్టూర్చింది. మధ్యాహ్నం రెండు గంటలకు శ్రీకాంత్ ఫోను చేస్తానన్నాడు. ఇంకా ఫోన్ రాలేదు. ఈ అరగంటలోనూ రాకపోతే, ఇక యీదినం శ్రీకాంత్‌ని కలుసుకోటం కుదరదు. అతడు ఫోన్ చెయ్యకపోతే ఏడుపొచ్చేలావుంది అరుణకు. సాధారణంగా అతడు ఇచ్చినమాట తప్పడు. మరి, ఎందుకు ఫోన్ చెయ్యలేదో?! ప్లాంటులో ఏదైనా 'బ్రేక్ డౌన్' వచ్చిందేమో! జూనియర్ ఇంజనీరు అంటే ప్లాంటులో చాలా 'బిజీ' పోస్టు! ప్లాంటుకు ఫోన్ చేద్దామని ముందుకు వంగింది. కాని అంతలోనే ఆగిపోయింది. ప్లాంటులో ఫోను శ్రీకాంత్ లేక ఇంకెవరయినా అందుకుంటే తన కంఠం గుర్తుపడతారు. వాళ్ళు శ్రీకాంత్‌ని పిలిచేలోగా జోలెడు ఆరాలుతీస్తారు.

తనకూ, శ్రీకాంత్‌కూ మధ్య ప్రేమ వ్యవహారంలో అబద్ధం లేదు. అయినా, ఆ విషయం ఇంతవరకూ ఇద్దరూ గోప్యంగానే వుంచేరు. పెళ్ళివరకూ రాకుండా యీ విషయం బయటకు రావటం ముఖ్యంగా తనకు ఇష్టంలేదు.

"నీకు మరీ భయం అరుణా! ఇలావుంటే ఎలా బ్రతుకుతాం? ఇద్దరం, మనసా ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకోబోతున్నాం. బయటకు తెలిస్తేయేం? ఇందులో భయపడాల్సింది ఏముంది?" అంటాడు శ్రీకాంత్.

"నీకేంబాబూ! నువ్వు మొగాడివి!...." అంటూ అర్థోక్తిగా ఆగిపోతుంది తను.

# ౫

"అదీ, నీ అనుమానం! మొగాణ్ని కనుక నేను మోసంచేసి పోతాను. ఆడదానివి కనుక అరటాకు వయిపోతావు. అంతేనా?" నిష్ఠూరంగా అంటాడు శ్రీకాంత్.

చేతుల్తో అతని నోరు మూసేస్తుంది.

గువ్వలా అతని గుండెలమీద వొదిగిపోతుంది.

అతని గుండెలమీద తలవాల్చి గుండెతో గుసగుసలాడుతున్నట్లుగా అంటుంది, "అలా మాట్లాడకు శ్రీకాంత్. నీమీద నాకెన్నడూ అపనమ్మకంలేదు. నిన్ను కాకపోతే, ఇంకెవర్నినమ్మను! నాకున్న పరిసరాలు, బాధ్యతలువేరు. పెళ్ళి దగ్గరయ్యేవరకూ మన వ్యవహారం ఇలాగే వుండనిద్దాం."

"నీ ఇష్టం అరుణా!" అంటూ తన జుత్తు నిమురుతాడు శ్రీకాంత్.

అతని వెచ్చని గుండెలమీద వొదిగి మరో లోకాలకు వెళ్ళిపోతుంది అరుణ.

"ట్రింగ్....ట్రింగ్!...."

ఫోను మోతతో యీ లోకంలోకి వచ్చింది. కంగారుగా 'కార్డ్' కనెక్ట్‌చేసి హెడ్ ఫోను సవరించుకుంది.

"రెండు నిమిషాలనుండి లైనుకోసం ప్రయత్నం చేస్తున్నాను...."

అవతలినుండి ఆఫీసు మేనేజరు గొంతు కోపంగా అంది.

"సారీసర్! టెలిగ్రామ్స్ టైపు చేస్తున్నాను!" అంటూ అవసరార్థం అబద్ధం ఆడేసింది.

"బిజీ అవర్‌లో అలాటివన్నీ పెట్టుకుంటే ఎలాగ? ప్లాంట మేనేజర్ కావాలి!"

కనెక్షన్ ఇచ్చి కుర్చీలో వెనక్కు వాలింది. ఇక్కడవున్న ఆరుగంటల్లో బిజీగానే వుంటుంది. ఆఫీసుపని అయ్యేక ఆ టెలిగ్రాములు టైపుచేసి అప్పుడు ఇంటికెళ్ళమని ఆయన భావం!

అయినా, బోర్డు ఎదర కూర్చోని పరాకుగా వుండటం—తనదే తప్పు! కాని, శ్రీకాంత్ ఆలోచనల్లోకి వస్తే పనిమీద మనస

నిలవదు! అతడు మనసులోకి రాకుండా చేసుకోవటం తనవల్లకాదు. 'ఆలోచనల్ని మళ్ళించుకునే శక్తేవుంటే, అంతకంటె ఇంకేం కావాలి?'

మెల్లగా కదిలే గడియారం ముళ్ళవంక చూసింది.

పావు తక్కువ నాలుగు!

టైపు చేయాల్సిన టెలిగ్రాములు పదిదాకా వున్నాయి. ఈ పావుగంటా కష్టపడకపోతే, పని పూర్తికాదు. ఆఖరు పదిహేను నిమిషాల్లోనూ సాధారణంగా 'కాల్స్' తక్కువ వస్తాయి. హెడ్ ఫోనుతీసి ప్రక్కనపెట్టి, ఫేను ఆపి టైపు మిషను ముందు కూలబడింది. కాగితాలు సర్దుతూ తల ఎత్తి తలుపులకున్న అద్దాల్లోంచి అవతలకు చూసింది. ప్రక్కనే క్రోటన్సు కుండీలు, ఆవల విస్తరించుకున్న పెద్ద పచ్చికబయలు! కార్లువచ్చి ఆగటానికి పోర్టికో! ఆఫీసు లోపలికి రావాలంటే అదేదారి! తన కౌంటరు ప్రక్కనుండే లోనికి వెళ్ళాలి!

ద్వారం దగ్గర గూర్ఖా నిలబడి వున్నాడు. తను అటు చూడగానే చిరునవ్వు చిందించేడు.

అతనికి ఎంత ఓపికో! ఉదయంనుండి సాయంకాలం వరకూ అలా నిలబడే వుంటాడు. తనవిధిని తాను నూటికి నూరుపాళ్ళూ సక్రమంగా నిర్వర్తిస్తాడు. పిడుగులుపడినా అక్కడనుండి కదలడు! తాను టైపుమిషను దగ్గర కూర్చొని తల ఎత్తితే సరిగ్గా అతడు కనుపిస్తాడు. వచ్చేటపుడూ, వెళ్ళేటపుడూ ఆఫీసర్లందరికీ వంగి సలాము చేస్తాడు.

కాగితాలమధ్య కార్బన్ పేపర్లుంచి మిషనులో బిగించింది అరుణ. యాంత్రికంగా టెలిగ్రాములు టైపుచేస్తోంది. ఫోన్‌కాల్స్ రాకపోవటంవలన పని తొందరగానే తెములుతోంది. అంతలోనే ఇందిర వచ్చింది.

"ఈవేళ, ఇంటికిరావా?" అంది.

"ఎందుకురాను?" అంటూ వేళ్ళు కదిలిస్తూనే సమాధానమిచ్చింది అరుణ.

"నాలుగయిపోయింది. అటు చూడు! అందరూ వెళ్ళిపోతున్నారు! మేనేజరు కారు అప్పుడే వెళ్ళిపోయింది" అంది ఇందిర.

అరుణ తలెత్తి చూసింది. అందరూ బయటకు కదలిపోతున్నారు.

"మీకేం అదృష్టవంతులు! మూడున్నర అయేసరికి 'ఎకవుంట్సు' క్లోజ్‌చేసి గడియారాలు వంక చూస్తూ కూర్చుంటారు" అంది అరుణ.

ఇందిర 'ఎకవుంట్సు సెక్షను'లో క్లార్కుగా ఆరునెలల క్రితం చేరింది. సింపుల్‌గా, నీటుగా తయారయి ఆఫీసుకు వస్తుంది. చలాకీగా కబుర్లు చెప్తుంది. మొత్తం ఆఫీసులో పనిచేసే రెండు వందల మందిలోనూ పద్నాలుగురే ఆడవాళ్ళున్నారు. అందరిలోనూ కాస్త సరదాగా కనుపించేది ఇందిరే! అదీకాక ఇందిరా, అరుణా ఒకే వీధిలో వుంటున్నారు. ఆఫీసయిపోయాక అప్పుడప్పుడు ఇద్దరూ కలిసి ఇళ్ళకు వెళ్ళటం అలవాటు.

"రెండు నిమిషాలు కూర్చో! ఈ పైపువర్కు పూర్తిచేసి వచ్చేస్తాను!" అంటూ చకచకా పని ముగించింది. కాగితాలు 'డిస్పేచ్ ట్రే'లో పడేసి హేండ్‌బేగ్ సర్దుకుంది. ఆఖరునిమిషం వరకూ శ్రీకాంత్‌నుండి ఫోను వస్తుందేమోనని ఎదురుచూసింది.

ఊహూ! నిరాశే మిగిలింది!

బద్ధకంగా బయటకు వచ్చింది. ఇద్దరూ కలిసి ఆఫీసుదాటి బస్సుస్టాప్ వైపు నడక సాగించేరు.

"కాస్త కాఫీ త్రాగి వెళ్దామోయ్! ఆ హోటలుకు పద!" అంది ఇందిర.

"ఇప్పుడేం వద్దు! నేను హోటల్లోకి రానుబాబూ!"

"ఏం? బిల్లు నేను ఇస్తానులే!"

"బిల్లుకోసం కాదు. అందరూ మనవంకే చూస్తారు. నాకు భయం" అంది అరుణ.

"అందరూ మనవంకే చూస్తారని భయం! నీ అందానికి దిష్టి

తగుల్తుందేమోనని భయం। హోటల్లో కాఫీ త్రాగటానికి భయం। నువ్వు ఆ కౌంటరులో కూర్చుని ఎలా పనిచేస్తున్నావో నాకు అర్థం కావటంలేదు."

"ఆ 'కౌంటరు'లో జంక్షను బాక్సుముందు కూర్చున్నంత సేపూ వేరే అవతారం। డ్యూటీతప్ప మరో ధ్యాసే వుండదు! అంతా యాంత్రికంగా జరుగుతుంది. ఇక్కడ 'పబ్లిక్ ప్లేసు'లో వ్యవహారాలు వేరుగా వుంటాయి" అంది అరుణ.

"ఈ మొగాళ్ళ వెకిలివేషాలకూ, వెర్రిచూపులకూ భయపడిన కొద్దీ మనల్ని ఇంకా భయపెడతారు. ఇన్నిభయాలతో సమాజంలో బ్రతకలేం। పద కాఫీ త్రాగుదాం, ఎవరయినా పళ్ళికిలిస్తే చెప్పు। కాఫీ కప్పు ముఖంమీద ఒంపేస్తాను।"

"ఎవళ్ళ ముఖంమీద? నా మొహంమీదా?" నవ్వింది అరుణ.

"కాదు! నిన్ను చూసి పళ్ళకిలించిన వాడి మొహంమీద।" అంటూ బలవంతంగా చెయ్యిపట్టుకుని హోటలులోకి లాక్కెళ్ళింది ఇందిర.

ఇద్దరూ కాఫీ త్రాగేరు. ఇందిర బిల్లు చెల్లిస్తూవుంటే అరుణ నివారించలేదు. ఎందుకంటే అసలే నెలాఖరు రోజులు! బేగులో వున్న పన్నెండు రూపాయలతో యింకా అయిదురోజులు గడవాలి। డబ్బు సంగతి జ్ఞప్తికి వచ్చేసరికి ఒక్కసారి నీరసం ముంచుకొచ్చింది అరుణకు। మంచంమీద పక్షవాతంతో పడివున్న తండ్రి, చదువుకుంటున్న యిద్దరు తమ్ముళ్ళు, వంటిల్లే స్వర్గంగా ఊహించుకుని అందులోనే గుడుగుడు గుంచాలాడే తల్లీ కనులముందు కదలాడేరు. మనసు ఆవేదనతో నిండిపోయింది। ఉదయం పదినుండీ, సాయంకాలం నాలుగువరకూ ఆఫీసులో యాంత్రికజీవనం మధ్య యింటి సంగతులు మరిచిపోతుంది. గుర్తుకు రాకకాదు-గుర్తు చేసుకోటం యిష్టంలేక। ఈ ఆరుగంటల్లోనూ ఆఫీసు వ్యవహారాలు, ఆఫీసర్ల మందలింపులు, పొగడ్తలు, చికాకులు యింకా నిట్టూర్పులు। మనసుకు శాంతి లభించేది నిద్రావస్థలోనే! అయితే వీటన్నిటిమధ్యా మనసునిండా ఆనందం నింపేది ఒకే ఒక ఆలోచన। అది, శ్రీకాంత్

గురించి! నాలుగుదినాల ఆలోచనలు, రెండు యుగాల నిరీక్షణలు, ఎప్పుడో వారానికి ఒకసారి ఏకాంతంలో కల్సుకోవటం, సర్వం మరిచి అతని సన్నిధిలో కబుర్లలో లీనమయిపోవటం! అదొక్కటే ఎడారిలాటి తన జీవితంలో ఒకే ఒక ఒయాసిస్సు! ముళ్ళ కంచె లాంటి జీవితం మధ్య ఒకే ఒక మల్లెపొద!

"ఏమిటో, ఇందాకటినుంచి చూస్తున్నాను. ఒకటే పర ధ్యానం!" అంది ఇందిర.

"అబ్బే ఏం లేదు!"

ఇద్దరూ బస్సుస్టాపుకు చేరుకున్నారు.

ఆఫీసులు వదిలే సమయం కావటం వలన జనం చాలా ఎక్కువమంది వున్నారు స్టాపులో! అంతలోనే ఒక పదమూడో నెంబరు బస్సు వచ్చి శరవేగంతో ఆగకుండా ముందుకు సాగి పోయింది.

"ఆఫీసులు వదిలే సమయంలో ఎక్కువ బస్సులు వెయ్యరు! జాతీయం అయితేగాని ఈ ఊరి సిటీ బస్సులతో ఈ బాధ తప్పదు!" అంటూ విసుక్కుంది ఇందిర. దూరాన అంతలోనే మరో పదమూడో నెంబరు బస్సు ఖాళీగావస్తూ కనిపించింది. దాని వెనకాలే మరో బస్సు! రెండూ ఖాళీగానే వున్నాయి. ఒకదానిని మరొకటి వెంట తరుముకుంటూ స్టాపులో ఆగకుండానే వెళ్ళిపోయాయి. అరుణ వింతగా చూస్తూ నిలబడిపోయింది.

"వీళ్ళకి ఒకళ్ళకంటె ముందు మరొకళ్ళు వెళ్ళిపోవాలన్న పోటీలే కాని, ప్రయాణీకుల బాధ ఏమాత్రం పట్టదు! స్టాపులో ఆప కుండా వెళ్ళి పోతారేమని అడిగేవాళ్ళు లేరు! అరుణా, మనం యీ స్టాపులో నిలబడితే, ఇలా బస్సుల రేసులు చూడాల్సిందే. చక్కగా నటరాజా సర్వీసుతో ఇంటికి వెళ్దాం పద!" అంది. ఇద్దరూ కలిసి నడక ఆరంభించేరు.

అరుణ మౌనంగా నడుస్తోంది.

"పదమూడో నెంబరు బస్సుల గురించి మా తమ్ముడు ఒక జోక్ చెప్పాడు...." అంది ఇందిర.

ఏమిటన్నట్లు ఆమెవైపు చూపింది అరుణ.

"విశాఖపట్నం పౌరుడు చచ్చి నరకానికి వెళ్ళేట్ట! యమ భటులు అతణ్ని బోనులో పెట్టి కత్తులు విసురుతూవుండే చాక చక్యంగా తప్పించుకున్నాడట! మండుతున్న బాణాలతో కొడుతూ వుంటే, అందకుండా ఇటూ అటూ తప్పించుకునే వాడట! ఆఖరికి యమభటులు అలసిపోయారు కాని అసలు రహస్యం కనిపెట్టలేక పోయారట! 'కత్తుల బోనునీ, మండేబాణాల్నీ యెలా తప్పించు కున్నావ్?' అని యముడు అడిగితే ఆ పౌరుడు చిరునవ్వు నవ్వి 'మహాప్రభో! విశాఖపట్నం రోడ్లమీద రాకెట్లలా దూసుకుపోయే పదమూడో నెంబరు పిటీ బస్సుల్ని తప్పించుకుంటూ పదిహేనేళ్లు బతికేను! నాకు ఇవొక లెఖ్కా!' అన్నాడట."

ఇందిర కధవిని అరుణ గలగలా నవ్వేసింది.

అంతలోనే ఇందిర ఇల్లు వచ్చింది "గుడ్ బై!" అంటూ గేటు తెరుచుకుని లోనికి వెళ్తూ "మా ఇంటికి ఎప్పుడొస్తావ్ అరుణా" అంది.

"ఒకే వీధిలో వుంటున్నాం కదా! వస్తానులే!" అంది అరుణ.

"అప్పుడే నాలుగు నెలలుగా అలాగే చెప్తూ గడిపేస్తున్నావు. ఈ వారంలో తప్పక రావాలి." అంటూ పూలమొక్కల మధ్యనుండి లోనికి హంసలా వెళ్ళిపోయింది ఇందిర.

అరుణ మెల్లగా నడిచి వీధిచివర పెంకుటింటి ముందు ఆగి మెల్లగా తలుపు తట్టింది.

## 2

ముందు గదిలో బేగ్ పడేసి వెనుక గదివైపు నడిచింది అరుణ. దాన్ని గది అనటంకంటె చిన్నకొట్టు అనటం సమంజసంగా వుంటుంది. తండ్రికి వేరుగా ఆ కొట్లో మంచం వేయించింది. ఆయనకు పక్షవాతం వచ్చినప్పటినుండీ అన్నీ మంచంమీదే! చిన్న పిల్లల్ని సాకినట్లు అన్నీ ఎవరో ఒకరు చెయ్యాల్సిందే?

"ఎలావుంది నాన్నా?" అంటూ తండ్రి మంచంమీద

కూర్చుంది.

అరుణను చూడగానే ఆయన కంట్లో నీళ్లు తిరిగేయి. అరుణకు అది మామూలే। సాయంకాలం తను ఆఫీసునుండి రాగానే ఆయన్ను పలకరించటానికి వెళ్ళటం, ఆయన కన్నీళ్లు పెట్టుకుని పసిపిల్లాడిలా ప్రవర్తించటం అలవాటయిపోయాయి. ఆయన కన్నీటి వెనుక ఆవేదనను అర్థం చేసుకోలేనిదేం కాదు అరుణ। అయితే, అర్థం చేసుకుని చేయగల్గిందేమీలేదు.

ఆయన ఆవేదన అంతా తనగురించే।

ఆయన కన్నీళ్ళన్నీ తన సౌఖ్యం గురించే।

"నేను బాగానే వున్నాను తల్లీ। కాని, నీకు తండ్రిగా ఏమీ చేయలేకపోతున్నాను" అన్నాడాయన రుద్ధస్వరంతో. పక్షవాతం వచ్చేక నోరు తిరక్క రోజు రోజుకీ స్వరంకూడా మారిపోతోంది।

జానకిరామయ్యగారు చేసినది బడిపంతులు ఉద్యోగమే అయినా పిల్లల పెంపకం బాగానే జరిగింది. అరుణ పెద్ద కూతురవటంవలన చాలా గారాబంగా పెరిగింది. తరువాత రెండు కాన్పులు పోయాయి జానకమ్మకు। ఆ తరువాత యిద్దరు మొగపిల్లలు! పెద్దవాడు మోహన్ బియ్యే రెండో సంవత్సరం చదువుతున్నాడు. రెండోవాడు యింటరుఫైనల్। జానకిరామయ్యగారు రిటైరయ్యేనాటికి అరుణ బియ్యే ప్యాసయింది. రిటైరయిన మూడు నెల్లోనే ఆయన పక్షవాతంతో మంచమెక్కేరు. పెన్షన్ డబ్బులతో సంసారం యీదలేక ప్రయివేట్లు చెప్పటం ప్రారంభించేరాయన। కాని ఆరోగ్యం చెడిపోవటంతో ప్రయివేట్లు కాస్తా మూతబడ్డాయి. నడిసముద్రంలో నావలా వుండిపోయిన ఆ సంసారానికి అరుణే చుక్కాని అయింది. మోజుపడి సరదాకొద్దీ సంపాదించిన డిగ్రీ అరుణకు అక్కరకు వచ్చింది. సంసారాన్ని యీదటానికి వేరుమార్గంలేని పరిస్థితిలో అరుణ ఉద్యోగంలో చేరింది, రెండేళ్ళక్రితం। అప్పటి నుండీ తండ్రి పెన్షన్ రాళ్ళు, తనకు వచ్చేజీతం నాలుగువందలు కలిపి అంతంత మాత్రంగా జీవితం గడుస్తోంది. ఈమధ్య ఆరు నెలలుగా చీటికట్టి మిగిల్చిన అయిదువందల రూపాయలూ, క్రితం

నెలలో తండ్రికి ప్రాణంమీదికి రావటంతో మందులకూ డాక్టర్లకూ ఖర్చయిపోయింది.

"మీ అమ్మ వద్దంటూవుంటే, నేనే చదివించేను. చదువు చెప్పించకపోయినా నీకీ బాధలు తప్పి వుండేవి" అన్నారాయన.

అరుణ మాట్లాడలేదు. తను ఏవిధంగానూ తండ్రిని ఓదార్చలేదు. కూతురిచేత చాకిరీ చేయించుకుని ఆ సొమ్ము తింటున్నామనే బాధ ఆయనకు మనసునిండా వుంది.

"నిన్నొక యింటిదాన్ని చేయవలసిన సమయంలో ఏముచ్చట్లూ తీరలేదు నీకు!" సణుగుతున్నారాయన.

"నాన్నా! మీరు యిలా ఆరోగ్యంగా వున్నారు కదా! నేను పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయాననుకోండి! తమ్ముళ్ళ చదువులు ఎవరు చూస్తారు? రెండేళ్ళు తిరిగితే మోహన్ బియ్యే పూర్తవుతుంది. అప్పుడు మీరుండమన్నా నేనీ యింటిలో వుండను. మీ ఆరోగ్యం కూడా త్వరలోనే నయమయిపోతుంది. మీరే నాకు పెళ్ళిచేసి పంపేద్దురుగాని!" అంది అరుణ.

జానకిరామయ్యగారు విరక్తిగా నవ్వేరు!!

అరుణ చెప్పినవన్నీ అందమయిన అబద్ధాలే!

మోహన్ రెండేళ్ళలో కాదు, ఇరవైయేళ్ళలో కూడా బియ్యే ప్యాసవడు. వాడికి యిప్పటికే చెడు సావాసాలన్నీ అలవడ్డాయి. వేళకు యింటికివచ్చి మెతుకులు తినటమే గగనమయిపోతోంది. ఇంట్లో కూర తీసుకురమ్మంటే అవమానంగా ఫీలయిపోయే మోహన్ రేపు బియ్యే ప్యాసయి సంసారాన్ని ఉద్ధరిస్తాడంటే ఆయన నమ్మలేడు.

ఇక, తన ఆరోగ్యమూ అంతంత మాత్రంగానే వుంది! ఏక్షణాన్నయినా తను కన్ను మూయవచ్చు! ఈలోగా అరుణ వివాహం తను చూడలేడు. తన చేతులమీదుగా ఆ శుభకార్యం చేయలేడు.

అరుణకు కూడా యివన్నీ నిజాలు కాబోవని తెలుసు. కాని క్షణ క్షణం భవిష్యత్తుకోసం ఆశ నింపుకుని ఎదురు చూడటం తప్ప

ఏంచేయటం? ఆ ఆశే లేకపోతే బ్రతుకే దుర్భరమయిపోతుంది. తన స్వార్థంకోసం యీ బంధాల నన్నిటినీ తెంపుకుని తాను పారిపోలేదు. అయితే యీ కుటుంబానికి తన అవసరం తీరిననాడు తన రంగుల భవిష్యత్తు తనకు ఎదురు రావాలని భగవంతుణ్ని ప్రార్థిస్తోంది. కాని అది ఎంతదూరంలో వుందో?

"అమ్మా! నాన్నకు హార్లిక్స్ యిచ్చేవా?" అంటూ తల్లిని పిల్చింది యీ ధోరణి తప్పించాలని.

జానకమ్మ వచ్చి మెల్లగా అంది "హార్లిక్స్ సీసా మూడు రోజులక్రితమే అయిపోయింది" హార్లిక్స్ అయిపోయింది! 'ఇప్పుడే కొంటాను' అనేశక్తి యింకా అయిదు రోజులవరకూ తనకురాదు. అప్పుచేసి కొనే ధీమాలేదు. ఇప్పటికే నాలుగువందలు అప్పు లున్నాయి. ఇంకా అప్పులుచేస్తే జీతంలో తినటానికి ఏమీమిగలదు.

"జీతం రాగానే కొంటానులే!" అంది నిట్టూరుస్తూ.

"అలాగేనమ్మా! నా మందులకూ, మాకులకూ అనవసరంగా ఎక్కువ ఖర్చుపెట్టకు" అన్నారు జానకిరామయ్యగారు. "వెళ్ళి ముఖం కడుక్కో? ఆఫీసు బడలిక అంతా నీ ముఖంలోనే వుంది."

మెల్లగా లేచి బయటకు వచ్చింది అరుణ.

ముఖం కడుక్కొని చీర మార్చుకుంది.

అద్దం ముందు కూర్చొని తల దువ్వుకుంటూవుంటే చంద్రం వచ్చేడు.

"అక్కయ్యా! ఈవేళ 'ఎసయిన్మెంటు' చాలా యిచ్చేరు. అన్నీ కొత్త ప్రాబ్లమ్స్! నువ్వీవేళ నాకు లెక్కలు చెప్పాలి" అన్నాడు పుస్తకాలు అల్మారాలో పడేస్తూ.

"ఇప్పుడే, ఆఫీసునుండి వచ్చిందిరా అది. దాన్ని కొంత విశ్రాంతి తీసుకోనివ్వు. నువ్వు యిలారా! కాఫీ యిస్తాను" అంటూ కసిరింది జానకమ్మ. వాడు ముఖం ముడుచుకుని వంటింట్లోకి వెళ్ళిపోయాడు.

విశ్రాంతి! తనకు ఎప్పుడు దొరుకుతుందో విశ్రాంతి!

అసలు తన జీవితానికది దొరుకుతుందా!

ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకూ తనొక యంత్రం! తెల్లవారుఝామున లేచి కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ త్రాగే సమయానికి ప్రయివేటు కుర్రాళ్ళు వస్తారు... తను బియ్యే లెఖ్ఖలతో ప్యాసయింది. ఇంటర్ కుర్రాళ్లు నలుగురికి లెఖ్ఖలు చెప్తాంది. వారానికి మూడు రోజులు వస్తారు వాళ్లు. వాళ్ళతోబాటు చంద్రానికి కూడా కాస్త చెప్పగలుగుతోంది. వాళ్ళ నలుగురివల్లా నెలకు ఎనభయి రూపాయలు వస్తాయి. ఇంట్లో బియ్యం ఖర్చు వెళ్ళిపోతుంది. ప్రయివేట్ల తర్వాత భోజనంచేసి ఆఫీసుకు పరుగెత్తటం, తిరిగిరావటానికి బస్సులకోసం పడిగాపులు, ఆరుగంటలకు యిల్లు చేరటం, ఇంట్లో కావల్సిన వస్తువులూ, తండ్రి మందులూ యివన్నీ సమకూర్చేసరికి చీకటి పడిపోతుంది. రాత్రి భోజనం, తర్వాత నిద్ర! తెల్లవారితే అంతా మామూలే!

చంద్రం కాఫీ త్రాగివచ్చి పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు. వాడికి చదువుతప్ప యింకో ధ్యాసపట్టదు. క్లాసులో వాడికి మంచి మార్కులే వస్తాయి. ఒక్కసారి చెప్తే ఏవిషయమయినా యిట్టే గ్రహిస్తాడు. ఇంట్లో కూడా బాధ్యత నెరిగి ప్రవర్తిస్తాడు.

పెద్ద తమ్ముడు మోహన్‌కీ రెండో తమ్ముడు చంద్రానికీ ఎక్కడా పోలికలు లేవు.

ఒకే తల్లి పిల్లలమధ్య ఇన్ని భేదా లెందుకువస్తాయో! సాయంకాలం ఆరుదాటి పోతున్నా ఇంకా మోహన్ ఇంటికి రాలేదు. కాలేజీ అయ్యేక స్నేహితులతో కలిసి సినిమాకో షికార్లకో వెళ్ళిపోతాడు. రాత్రి పదిగంటలకు ఇంటికి వచ్చి నాలుగు మెతుకులు తిని పడుక్కుంటాడు. సిగరెట్లు త్రాగటం సరే సరి! ఓరోజురాత్రి ఆలస్యంగా వచ్చి తలుపు తడితే తనే తీసింది. వాడి కళ్ళు ఎర్రగావున్నాయి.

గుప్పున వాసన కొట్టింది వాడి దగ్గర!

అరుణ స్థంభించిపోయింది! నోరు పెగుల్చుకుని "మోహన్! తాగేవుట్రా?" అంది. వాడు ఆమె వంక చూసి భోరున ఏడుస్తూ కాళ్ళమీద పడిపోయాడు.

"అక్కా! ఎవరికీ చెప్పకు! ఫ్రెండ్ ఇంట్లో పార్టీ అయింది. బలవంత పెడితే కొంచెం తీసుకున్నాను. ఇంకెన్నడూ ముట్టుకోను. నాన్నకు ఈ సంగతి తెలియనివ్వకు. నీ కాళ్ళు పట్టుకుంటాను." అన్నాడు.

"ఇంకెన్నడూ త్రాగనని నా చేతిలో చెయ్యేసి చెప్పు!" అంది.

మోహన్ ప్రమాణం చేశాడు!

"నువ్వు మళ్ళీ తాగేవంటే నేను చచ్చిపోయినంత ఒట్టు!" అంది.

"అంత మాటనకు అక్కయ్యా! ఇంకెప్పుడూ తాగను!" అన్నాడు.

ఆ మైకంలోనే బోలెడు ప్రమాణాలు చేశాడు.

అరుణకు తెలిసి నంతవరకూ ఆ నెలలోనే రెండుసార్లు చచ్చి పోయింది. తెలియకుండా మరెన్ని సార్లు చచ్చిపోయిందో!

రెండోసారి త్రాగి వచ్చినప్పుడు మోహన్ మాట్లాడలేదు.

మూడోసారి దొరికిపోయినప్పుడు "నువ్వేం నాకు డబ్బిస్తున్నావా? నా ఫ్రెండ్స్ డబ్బుతో తీసుకుంటున్నాను. మధ్య నీ కెందుకు?" అన్నాడు.

జానికమ్మకు కూడా ఈ విషయం తెలిసిపోయింది ఒక రోజున!

నెత్తీ నోరూ బాదుకుంటూ విలపించింది.

"ఆడదాని సొమ్ము తింటూ బ్రతుకుతున్నావ్! సిగ్గులేదూ! పైగా, త్రాగివస్తావా? ఛీ! అంతకంటె చావరాదూ!" అంటూ శాప నార్థలు పెట్టింది.

అరుణ తల్లి దగ్గరకు వచ్చి "అమ్మా! ఈ సంగతి నాన్నకు తెలియ నివ్వకు. ఆయనకు ఆరోగ్యం ఎలాగూ ఇవ్వలేక పోతున్నాం కనీసం మనశ్శాంతి నయినా మిగలనియ్యి!" అంది రెండు చేతులూ పట్టుకుని.

"నాకు తెలీదా తల్లీ! ఆయనకు చెప్పనులే!" అంటూ నోరు

మూసుకుని ఊరుకుంది.

తరువాత మోహన్ ఇంటికి త్రాగిరావటం మానేశాడు. అసలు ఇంటికి రావటమే తగ్గించేశాడు.

వాడి ప్రవర్తనతో విసుగెత్తిపోయిన అరుణ పరిస్థితులతో రాజీపడటం ఆరంభించింది. అయితే వాడి నీడన చంద్రం చెడి పోతాడన్న భయం అధికమయింది. ఎప్పటికయినా ఇంటినిచంద్రమే ఆదుకోవాలి. వాణ్ని బాధ్యతగల వ్యక్తిగా తీర్చి దిద్దాల్సిన భారం తన మీద వుంది.

అరుణ తలెత్తి చంద్రం వంక చూసింది.

ఏదో లెక్కతో సతమత మవుతున్నాడు.

"తమ్ముడూ! ఇలా తీసుకురా! నేను చెప్తాను." అంది ఆప్యాయంగా.

"ఫర్వాలేదులే అక్కా! నువ్వసలే అలసిపోయావు!" అన్నాడు.

"ఇలా తీసుకురా!" అంది మళ్ళీ.

పుస్తకం తీసుకు వచ్చాడు వాడు. వాడికి లెక్కలు చెప్ప టంలో లీనమయి కొంతసేపు పరిసరాలనే మర్చిపోయింది.

తరువాత భోజనం ముగించి పేపరు చదివింది. రాత్రి తొమ్మిది న్నర దాటిపోతున్నా మోహన్ ఇంటికి రాలేదు. అంటే యింక యీ దినానికి రాడన్నమాటే!

దీపం ఆర్పి వీధి తలుపులు గడియవేసి పక్కమీద వాలి పోయింది.

అప్పటికే తల్లీ, చంద్రం నిద్రలో మునిగిపోయారు.

ప్రక్కకొట్టు గదిలోనుండి తండ్రి దగ్గు ఆగిఆగి వినిపిస్తోంది.

తలగడాలో ముఖం దాచుకుని ఆలోచనల్లో మునిగిపోయింది అరుణ!

నిద్రముందు యిదొక పర్వం!

దినంలో కొన్ని ఆనందమయ క్షణాలు!

మిగిలిన ఆలోచనలన్నిటినీ తోసిపుచ్చి శ్రీకాంత్‌ని మనసులో ప్రతిష్ఠేపించుకుంటుంది.

అతని పరిచయం నాటినుండీ జరిగిన సంఘటన లన్నిటినీ గుర్తుకు తెచ్చుకుంటుంది. లేకపోతే నిద్రపట్టదు!

శ్రీకాంత్‌తో తన పరిచయం యెంత విచిత్రం?

తల్చుకుంటే అంతా ఒక కలలా అనిపిస్తుంది.

మూడేళ్ళ క్రితం ఆరంభమయిన పరిచయం యీ నాటికి మొగ్గలు వేసి పూలు పూచింది. విడదీయలేనంత బలంగా ప్రేమ పాశంతో బంధించింది.

శ్రీకాంత్‌తో పరిచయమయిన తొలి దినాలు కనులముందు మెదిలేయి!

# 3

అప్పట్లో తను ఎ.వి.యన్. కాలేజీలో బియ్యే ఆఖరు సంవత్సరం చదువుతూ వుండేది. కాలేజీనుండి సాయంకాలం బయటకు వచ్చే వేళకు గేటు యెదురుగా వుండే కిళ్ళీషాపు దగ్గర జావా ఆపి యెవరికోసమో నిరీక్షిస్తూ వుండేవాడు శ్రీకాంత్. తను మిగిలిన స్నేహితురాళ్ళతో కలిపి తలదించుకుని కాలేజీ డౌన్ వరకూ నడచి వచ్చేసేది. అతను జావా స్టార్టుచేసి తమనుదాటి ముందుకు వెళ్ళిపోయేవాడు. అంతకంటె ఏ విధమయిన వెకిలి చేష్టలూ చేసేవాడు కాదు. క్రమేణా అతని నిరీక్షణ తనకోసమేనని కొద్ది దినాల్లోనే గ్రహించగలిగింది అరుణ. తనతో బాటు ఆ విషయాన్ని మిగిలిన స్నేహితురాళ్ళుకూడా గమనించేరు. అప్పటినుండీ 'మీ జావా వీరుడు నీ కోసం ఎదురుచూస్తున్నాడు' అంటూ ఆటలు పట్టించి వేళాకోళం చేసేవారు. "ఏయ్! మిష్టర్! నావెంటపడటం తప్ప నీకేం పనిలేదా?" అని ఓ దినం నిలదీసి అడిగెయ్యాలనుకుంది. కాని, 'కిళ్ళీ కొట్టుకు రోజూ వస్తాను మీ కాలేజీ గేటువైపు చూస్తాను. మధ్యన మీకెందుకు బాధ?' అని అడిగితే ఏం సమాధానం చెప్పాలి? తనే నవ్వులపాలు కావాలని వూరుకుంది.

ఓ రోజు ఇంగ్లీషు సినీమా చూడాలని తండ్రిని వొప్పించి తాను ఒక్కత్తే బయలుదేరింది. క్యూలో నిలబడివుండగా 'నాకూ ఒక టిక్కెట్టు తీసుకోండి, ప్లీజ్!' అంటూ చొరవగా వినబడిన

కంఠంవిని వెనక్కు తిరిగింది. అతడే! జావాపీరుడు!! అతని కనుల నిండా అభ్యర్థన! మాటల నిండా తీయదనం!

అతని పలుకులకు కరిగిపోయింది. అతని కోరిక కాదనలేక పోయింది.

అయిదు రూపాయల నోటు చేతిలో పెట్టి దూరంగా వెళ్ళి నిలబడ్డాడతను.

అంతలోనే తనలో అహం తలయెత్తింది. అతన్ని యెలాగయినా ఏడిపించాలనిపించింది. టిక్కెట్టు తనచేత తీయించి తన ప్రక్క సీట్లో కూర్చోటానికి ప్లాను వేసేదన్నమాట! కౌంటరులో డబ్బు చెల్లించి రెండు టిక్కెట్లూ చెరో వరుసలోనూ దూరదూరంగా వచ్చేటట్లు తీసుకుంది.

అతని టిక్కెట్టు అతని కిచ్చేసింది!

"థాంక్స్!" అంటూ కదిలి పోయాడతను!

థియేటరులోకి వెళ్ళి కూర్చుంది తను! న్యూస్‌రీలు మొదలయింది.

ప్రక్కసీట్లో ఎవరో వచ్చి కూర్చుంటే మెల్లగా తల తిప్పి చూసింది.

పల్చని వెలుగులో అతన్ని గమనించ గల్గింది.

అతడే! జావా పీరుడు!

"ఆశ్చర్యపోకండి! మీ టిక్కెట్టు మీది నెంబరుచూసి మీ ప్రక్కకు నా నెంబరు మార్పించుకున్నాను." అన్నాడు.

"నన్ను వెంటాడటం తప్ప వేరే పనిలేదా మీకు?"

ఆ మాటలు ఆవేశంతో అనేసినా తరువాత బాధపడింది. అతడు చిన్నగా నవ్వేడు.

"అయిదు రూపాయల్లోనూ రెండూ ఎనభై టిక్కెట్టుకు పోతే నాకు ఇంకా రెండూ ఇరవై పైసలు వస్తాయి. చిల్లర యివ్వలేదు మీరు."

అతని మాటలు విన్నాక నరనరాల్లోనూ సిస్సత్తువ ఆవరించింది. చిల్లర యివ్వటం మరిచిపోయింది తను! నిజమే!

"క్షమించండి" అంది మెల్లగా.

"ఫర్వాలేదు. ఇంతవరకూ మీరు మాట్లాడిన రెండు వాక్యాల్లోనూ ఎనిమిది పదాలున్నాయి. కనుక మనం మిత్రుల మయిపోయి నట్లే లెక్క! నా పేరు శ్రీకాంత్, శ్రీ కెమికల్స్ ప్లాంటులో జూనియర్ ఇంజనీరుగా పనిచేస్తున్నాను." అన్నాడు. తనేం మాట్లాడలేదు. కనీసం తన పేరయినా చెప్పలేదు. సినిమా చూస్తున్నంత సేపూ తమ మధ్య సంభాషణ జరగలేదు. ఇంటర్వెల్ అయిపోయాక సినిమా చూస్తూ మెల్లగా అంది.

"మీకు సినిమా అయ్యేక చిల్లర మార్చి యిస్తాను."

సినిమా ఇంకో అయిదు నిమిషాల్లో పూర్తి అవుతుందనగా లేచి వెళ్ళిపోయాడు శ్రీకాంత్. కొద్ది సెకన్లలోనే బయట జావా స్టార్ట్ అయిన శబ్దం విన్పించింది.

ఆ తరువాత సుమారు పదిరోజులు గడిచేయి. పౌడరు,స్నో కొనటానికి ఆదివారం నాడు సూపరు బజారు వెళ్ళింది. బిల్లు పదమూడు రూపాయల యాభైమూడుపైస లయింది. ఇరవైరూపాయలకు కౌంటరులో చిల్లరలేదు. "మూడూ యాభైమూడుపైస లిస్తే పదిరూపాయల నోటు ఇస్తాను." అన్నాడు సేల్సుమన్. అప్పుడు వెనుక నుండి ఓ చెయ్యి ఆ డబ్బు అందించింది.

"పదిరూపాయల నోటు ఆమె కివ్వండి" అంటూ.

తను వెనుతిరిగి చూసింది.

చిరునవ్వుతో శ్రీకాంత్!

"మీరా? అంది సంభ్రమంగా.

"అవును, నేనే, మారిపోయానా? ' అంటూ తనవంక చూసు కున్నాడు.

తరువాత మెల్లిగా "నేను మిమ్మల్ని వెంటాడటం లేదు. సూపర్ బజారుకు పనిమీద వచ్చేను." అన్నాడు.

తను నవ్వకూడ దనుకుంది కాని సీరియస్‌గా మూతిబిగించి తన వంకే చూస్తున్న శ్రీకాంత్‌ను చూస్తే నవ్వు ఆగింది కాదు.

గలగలా నవ్వేసింది తను. తనతోబాటు అతడూ శృతి కలి

పేడు.

సేల్సుమన్ తనచేతిలో పదిరూపాయల నోటు వుంచేడు.

"మొత్తం అయిదురూపాయల డెభ్భైమూడుపైసలు బాకీ?" అన్నాడు శ్రీకాంత్.

పదిరూపాయల నోటు అతనిచేతిలో వుంచింది తను.

"నా దగ్గరా చిల్లరలేదు!" అన్నాడు.

"ఫర్వాలేదు, తర్వాత ఇవ్వండి!" అంది తను.

"అయితే, మరోసారి నన్ను కలుసుకోవాలను కుంటున్నారన్న మాట!"

ఆ మాటలతో ఒళ్ళు మండిపోయింది తనకు!

"నే నేం అనుకోవటమూ లేదు, కోరుకోవటమూలేదు. మీరు నాకు చిల్లర యివ్వ నక్కరలేదు." అంటూ విసవిసా నడిచి బయటకు వచ్చేసింది.

ఇంటికి వచ్చేక తాను ప్రవర్తించిన తీరుకు బాధపడింది కొంతసేపు! అయినా, అంతకంటె చనువు యివ్వటం అనవసరం అని కూడా అనిపించింది.

ఆరాత్రి మొట్టమొదటిసారిగా అతన్ని గురించిన ఆలోచనలు అరుణను కలవరబెట్టాయి. తరువాత చాలా దినాలు అతడు కనబడ్డ లేదు. కాలేజీ దగ్గరకు రావటం మానేశాడు. అతడు రావటం మాని వేసిన దగ్గరనుండీ తనకు తెలియకుండానే మనసులో అతన్ని గురించిన ఆరాటం ఎక్కువయింది. అతనిలోని ఏదో ఆకర్షణ తనను కట్టి పడేస్తోంది. జావా శబ్దం వినపడితే రోడ్డు పరికించి చూసేది. విశాఖపట్నంలో జావాలకు కొదవేమిటి? ఆ ఆశ నిరాశే అయ్యేది!

చాలా రోజుల తర్వాత ఓ దినం రామకృష్ణా బీచ్‌లో కనుపించేడు శ్రీకాంత్.

"గుడ్ యీవినింగ్" అన్నాడు దగ్గరగా వచ్చి.

"గుడ్ యీవినింగ్" అంది చిరునవ్వుతో.

"అమ్మయ్య! మీకు నా మీద కోపం పోయిందన్నమాట! ఈ సారి మన ఋణాలు తీర్చేసుకుని బాకీలేకుండా బ్రతుకుదాం!" అన్నాడు.

"అలాగే" అంది తను.

"రండి! క్వాలిటీ రెస్టారెంటులో కాఫీ త్రాగుదాం!" అన్నాడు చొరవగా. తాను సందేహించింది. ఎవరికంటనయినా పడితే బాగుండదేమో ననిపించింది. కాని, రెండోసారి బలవంతం చేస్తే కాదనలేక పోయింది. రెస్టారెంటులో జనం పల్చగా వున్నారు. పిట్టగోడకు చేరువగావున్న ఒక మూల టేబిల్ దగ్గరకు దారితీశాడు శ్రీకాంత్. అతని వెనుకనే బెరుగ్గా కదిలి వెళ్ళింది అరుణ. కుర్చీల్లో కూర్చున్నాక "మన బాకీలు తీర్చేసుకుందామని అనుకున్నాం కదా!" అన్నాడు.

"ఇచ్చెయ్యండి" అంటూ చేయి చాపింది తను.

"ఏమిటి?" అంటూ తన కళ్ళలోకి చూసేడు. తనకు మొదటిసారిగా అతని సాన్నిధ్యంలో సిగ్గు ముంచుకొచ్చింది. మౌనంగా వుండపోయింది కొంతసేపు.

తరువాత మెల్లగా అంది "మీరు నాకు ఇవ్వాల్సినవి!"

"నేను మీకు ఇవ్వాల్సినవి చాలా వున్నాయి." అన్నాడు శ్రీకాంత్ కొంటెగా తనవంక చూస్తూ.

అంతలో బేరర్ వచ్చాడు. "రెండు కాఫీలు తీసుకురా!" అన్నాడు శ్రీకాంత్.

బేరర్ టేబిలు మీది ఖాళీ ట్రే తీసుకుని వెళ్ళిపోయాడు.

"మీరు నా కివ్వాల్సిన డబ్బు యివ్వండి" అంటూ చేయి చాచింది అరుణ.

శ్రీకాంత్ తన చేతి వంక తేరిపారచూచి "మీచేతిలో అదృష్ట రేఖ చాలా పెద్దదిగా వుంది" అన్నాడు.

"మీరు జ్యోతిష్కులా?" అంటూ కొంటెగా నవ్వింది.

"అవును. మీ పాణిని గ్రహించి జోస్యం చెప్పనా?" అంటూ తన అరచేతిని పట్టుకోబోయాడు. అంతలో కప్పులు టేబిలు మీద వుంచబోతున్న బేరర్ చేతికి తగిలి కాఫీ టేబిలుమీద వొలికింది.

"మరో కప్పు తెస్తాను సార్!" అన్నాడు బేరర్ వినయంగా.

"ఫర్వాలేదు, అలావుంచి వెళ్ళు!" అన్నాడు శ్రీకాంత్.

"ఇంకా నయం కాస్త గట్టిగా తగిలివుంటే కప్పు బద్ద

లయ్యేది." అంది తను.

"మనసులు కూడా అంతే కదూ! పదిలంగా చూచుకోక పోతే బ్రద్ద లవుతాయి. ఏమంటారు!"

"ఏమో, నాకు తెలీదు" అంది తను.

"అవును, ఎలా తెలుస్తుంది? ఇచ్చిన వాళ్ళకి ఆ బాధ తెలుస్తుంది."

అంతలో బేరర్ వస్తే బిల్లు చెల్లించేడు శ్రీకాంత్.

తాను బయలుదేరి వచ్చేస్తూ వుంటే "మీ పేరయినా చెప్పక పోవటం అన్యాయం" అన్నాడు.

"అరుణ" అనేసి వచ్చేసింది తను.

"ఏ ఆదివారం సాయంకాల మయినా నన్ను యిక్కడ కలుసుకోవచ్చు!" అన్న అతని మాటలు రెస్టారెంటు మెట్లు దిగుతూ వుంటే తన చెవిన పడ్డాయి.

ఆనాటినుండీ శ్రీకాంత్‌ను గురించిన ఆలోచనలు తనను ఎక్కువగా చుట్టు ముట్టేయి. ఇంట్లో తల్లికూడా తన పరధ్యానం గ్రహించింది. ఒకటి రెండుసార్లు "ఏమిటమ్మా! పరధ్యానంగా అలా వుంటున్నావు?" అంటూ అడిగింది. ఒకసారి ఆమాట తండ్రి చెవిని కూడా పడింది.

"అది పరధ్యానం కాదే, వరధ్యానం.....! నీ కూతురికి ఓ మంచి సంబంధంచూడు. పరీక్షలయ్యేక మూడు ముళ్ళుపడితే అన్ని పరధ్యానాలూ పారిపోతాయి" అంటూ ఎగతాళి చేశారు.

"పోండి నాన్నా" అంటూ సిగ్గు ప్రకటించి అక్కడినుండి తప్పించుకుంది.

తనది పరధ్యానంకాదు, వరధ్యానమే; 'ఆ వరుడు శ్రీకాంత్ అయితే ఎంత బాగుండును?' అన్న ఆలోచన మనసులో గాఢంగా చోటు చేసుకుంది.

ఆ తర్వాత ఆదివారం ఎంతవారించినా వినకుండా కాళ్ళు రామకృష్ణా బీచ్‌వైపు తీసుకువెళ్ళేయి. బయలుదేరబోయేముందు "ఎక్కడికమ్మాయ్! ఇంత చీకటిపడ్డాక?" అంది జానకమ్మ.

"బీచ్ రోడ్‌లో ఓ స్నేహితురాలింటికి వెళ్ళాలమ్మా! తొందరగా వచ్చేస్తానులే!" అంటూ బయలుదేరింది.

బీచ్‌లో కూర్చుని చాలాసేపు శ్రీకాంత్ కోసం నిరీక్షించింది. విసుగెత్తి తిరిగి బయలుదేరబోతూవుంటే బయట జావా ఆగిన శబ్దం వినిపించింది. తనను చూస్తూనే దూరంనుండి చెయ్యి వూపేడు శ్రీకాంత్.

"గుడ్! మంచి అమ్మాయి మీరు? మాటప్రకారం వచ్చేశారు! మీకు అనంతామాత్యుడు తెలుసా?" అన్నాడు.

"ఆయనెవరు?" అంది తాను ఆశ్చర్యంగా.

"ఆవు తన దూడకు పాలిచ్చి పులికి ఆహారంగా తిరిగివచ్చిన కథ ఆయనే ముందుగా గ్రంథస్థం చేశాడట. అదిగో, ఆ కథలో ఆవులా మీరు కరెక్టుగా వచ్చేశారు!"

"భలే మాట్లాడుతారు మీరు! అయినా, నేను మీతో వస్తానని చెప్పలేదుగా?"

"మీరు చెప్పలేదు. కాని అవిగో, ఆ కళ్ళు చెప్పాయి! ఆ కొంటెకళ్లు మీరేం దాచాలనుకున్నా దాచలేవు!"

"అయితే, నేను కళ్ళు మూసేసుకుంటాను బాబూ!" అంటూ మెత్తగా కళ్లు మూసేసుకుంది. పెదాలపై చిరునవ్వును మాత్రం దాచుకోలేకపోయింది. శ్రీకాంత్ వేళ్ళు తన బుగ్గలమీద వాలి కనురెప్పల్ని విడదీశాయి సుతారంగా. అతని వేడి వేళ్ళ స్పర్శ తన బుగ్గలకు తాకగానే తనువు నిలువెల్లా పులకించిపోయింది. అంతలోనే అతని వేళ్లను సుతారంగా తన బుగ్గలమీదనుండి తొలగించి దూరంగా జరిగింది.

"అలా కూర్చుందామా?" అన్నాడు.

"ఇక్కడ వద్దుబాబూ! నాకు భయం!" అంది తను.

"ఏం? భయమెందుకు?" అన్నాడు గోముగా.

'అవును, భయమెందుకు? తనకు మునపటివలె కాక, శ్రీకాంత్‌పై ప్రేమభావం ఏర్పడుతోంది. తన మనసు ముందటివలె స్వచ్ఛంగాలేదు. దానిమీద ప్రేమ, ఆకర్షణలాటి భావాలేవో పడ్డాయి.

అందుకే తాను భయపడుతోంది' అనుకుంది.

"అలా దూరంగా వెళ్ళి కూర్చుందాం. కనీసం ఒక ఫర్లాంగయినా వెళ్దాం, మనుషులకు దూరంగా!"

"నా జావామీద వెళ్దాం!"

"వద్దు! నేను బీచ్‌లో నడిచి వస్తాను. మీరు జావామీద రండి. అదిగో, ఆ కొత్త బిల్డింగు కనుపిస్తోంది కదా, దాని ఎదురుగా బీచ్‌లో కూర్చుందాం" అంది తను.

అతడు సరేనన్నట్లు తలవూపి వెళ్ళిపోయాడు.

ఆవేళ యిద్దరి కుటుంబ విషయాలు వొకరికొకరు చెప్పుకున్నారు.

ఆ తరువాత, బీచ్‌లోని ఆ చోటు తామిద్దరికీ ప్రత్యేక సంకేత స్థలమయింది. తన హృదయం పూర్తిగా అతనికి అర్పితమయిపోయింది!

శ్రీకాంత్ తండ్రికి ఏలూరు దగ్గర్లో కొద్దిపాటి భూమివుంది. ఆయన వ్యవసాయంమీదే జీవనం గడుపుతున్నారు. శ్రీకాంత్‌కు ఒకే ఒక చెల్లెలుంది. ఆమెకు పెళ్ళయిపోతే శ్రీకాంత్‌తో తన వివాహానికి ఆటంకం వుండదు. అయితే వాళ్ళది కూడా మధ్య తరగతి కుటుంబమే అవటంవలన వ్యవసాయంమీద ఏమీ నిలవ వెయ్యలేకపోయాడు శ్రీకాంత్ తండ్రి! చెల్లెలి పెళ్ళికి ఆర్థికంగా సహాయం అందించి ఆదుకోవలసిన అవుసరం యీతనిమీద వుంది. శ్రీకాంత్‌కు నెలకు ఎనిమిదివందల రూపాయల జీతం వస్తుంది. కటింగ్స్ అన్నీపోగా అరువందలు చేతికివస్తుంది. జావా కూడా కంపెనీ 'లోను' మీదే కొన్నాడు. ఓ చిన్న రూమ్‌లో వుంటూ నాలుగువందలతో తాను కాలం గడుపుతూ యింటికి రెండువందల రూపాయలు పంపిస్తున్నాడు.

శ్రీకాంత్‌తో పరిచయమయిన యీమధ్య రోజుల్లో అరుణ కుటుంబస్థితి కూడా అస్తవ్యస్తమయింది. తాను బియ్యే పూర్తిచేసిన నాలుగు నెలల్లోనే తండ్రికి పక్షవాతం రావటం, బ్యాంకులో వున్న కాస్త సొమ్మూ ఆయన మందులకు ఖర్చు కావటంతో కుటుంబం

ఒడుదుడుకుల్లో పడింది. ఈస్థితి అంతావిని "నువ్వు ఏదైనా ఉద్యోగంలో చేరి సహాయం చెయ్యి అరుణా!" అని సలహా యిచ్చేడు శ్రీకాంత్. అంతవరకూ తనకా ఆలోచనేలేదు. తాను ఉద్యోగం చెయ్యటానికి యింట్లో వొప్పించటమూ పెద్ద కష్టంకాలేదు! అయితే 'జాబ్' దొరకటమే పెద్ద సమస్య అయింది. ఆ తరుణంలో కూడా శ్రీకాంతే ఆదుకున్నాడు. తనకు సన్నిహితుడయిన వొక సూపరింటెండెంటు ఇంజనీరుతో చెప్పి శ్రీ కెమికల్స్‌లో ఆఫీసు టెలిఫోను ఆపరేటరు ఉద్యోగం తనకు లభించేటట్లు చేశాడు. ఆనాటినుండి ప్రేమతోబాటు అతనియెడల తనకు కృతజ్ఞతాభావం కూడా అధికమయింది. ఇన్నాళ్ళుగా తమ ప్రేమ వ్యవహారం ఎవ్వరికీ చెప్పలేదు తామిద్దరూ!

రహస్యంగా కలుసుకొని కబుర్లు చెప్పుకోపటం. ఒకరి సలహాలు మరొకరు స్వీకరించటం తప్ప ఏనాడూ తప్పటడుగులు వేయలేదు. ఈ సమస్యలమధ్యనుండి బయటకు వచ్చాక యిద్దరి కుటుంబాలూ ఒక ఒడ్డున పడ్డాక తాము వివాహం చేసుకోవాలని నిశ్చయం తీసుకున్నారు. సమయం వచ్చినపుడు యింట్లో చెప్పవచ్చునని ఈ విషయం వాయిదా వేస్తూవచ్చింది తను. అటు ఆఫీసులోనూ, ప్లాంటులోనూ కూడా యెవరి నోళ్ళలోనూ పడకుండా కాలం గడుపుకొస్తున్నారు. ఆఖరికి అతని వెనుక జావామీద కూర్చోవటమన్నా భయమే! బీచ్‌కి తాను బస్సుమీదవెళ్ళి తిరిగిరావటం! ఏ రోజయినా కాస్త చీకటి పడి ఆలస్యమయినా భయమే!

"మరీ చీకటయిపోయింది. ఇక వెళ్ళిపోదాం" అనేది తను.

"ఏం, చీకటిపడితే నిన్ను కొరుక్కుతింటానా? ఇన్నాళ్లయినా నా ప్రవర్తనమీద నీకు నమ్మకం కలగలేదు. మన పెళ్ళి జరిగేవరకూ అలాటిదేమీ జరగదులే" అంటాడు.

"ఎలాటిది?" కొంటెగా అంటుంది.

"చెప్పమంటావా?" అంటూ తన చేతిని అతని అరచేతుల్లోకి తీసుకుని మృదువుగా పెదవులతో చుంబిస్తాడు! అంతే.

అయితే, సుమారు మూడునెలల క్రితం ఒకనాడు జరిగిన

సంఘటనలో తానే కాస్త తొందరపడింది. శ్రీకాంత్ జాగ్రత్తవల్ల అనాడు ఏమీ తప్పటడుగు వేయకుండా బయటపడ్డారు. ఓ నాడు సింహాచలం రమ్మని అడిగేడు అతను

"అమ్మో, అంత దూరమా?" అంది తాను భయంగా.

అప్పటివరకూ బీచ్‌లో హోటల్స్‌లో కలుసుకోవటం తప్ప కనీసం శ్రీకాంత్ గదికయినా తను వెళ్లలేదు.

"సింహాచలం కలకత్తా అవతల వుందనుకుంటున్నావు కాబోలు. సిటీబస్సుమీద వెళ్ళొచ్చును" అన్నాడు ఎగతాళిగా.

"అవునులే, నాకు తెలుసు! కాని, బోలెడంత టైము పట్టదూ!"

"ఉదయం ఏడు గంటలకు బయలుదేరితే మధ్యాహ్నం రెండు గంటలలోగా తిరిగి వచ్చెయ్యొచ్చును."

"మరి, యింటి దగ్గర యేమని చెప్పను....?" అని అడిగింది.

"అబ్బా! అన్నీ నేనే చెప్పాలి నీకు. దేవుణ్ణి చూసి రావటానికని చెప్పు!"

"అలా అయితే అమ్మ కూడా నాతో బయలుదేరుతుంది...."

"చంపావు పో! స్నేహితురాలి పెళ్ళి జరుగుతోందని చెప్పు! లేదా పిక్నిక్ అని చెప్పు....యేదో ఒకటి, కారణమే దొరకదా?"

సరేనని ఒప్పుకుంది తాను.

మరునాడు తెల్లవారుఝామునే లేచి తలంటుకొని తనకు నచ్చే ఆకాశనీలంరంగు నైలెక్స్‌చీర, అదేరంగు బ్లవుజ్ వేసుకుంది. జడ అల్లుకోకుండా రిబ్బనుతో ముడివేసి వదిలేసింది. స్నేహితురాలి పెళ్ళికి సింహాచలం వెళ్తున్నానని తల్లితో చెప్పి బయలుదేరింది.

సింహాచలం స్టాండులో సిటీబస్సు దిగేసరికి తనకోసం ఎదురు చూస్తున్నాడు శ్రీకాంత్.

జావా స్టార్టుచేసి "ఎక్కు" అన్నాడు.

"నేను కూర్చోను బాబూ! బస్సెక్కి పైకి వస్తాను!" అంది భయంగా.

"ఏమీ ఫర్వాలేదు. నిన్నూ నన్నూ చూడటానికి పని కట్టుకుని ఎవరూ యిక్కడికి రాలేరు లే!" అన్నాడు.

జావామీద యెక్కి అతని వెనుక కూర్చొని భుజాలు గట్టిగా పట్టుకుంది. అతడు కొండవైపుకు తీసుకు వెళ్ళకుండా తిన్నగా ఓ గుట్టమీదవున్న బంగళావద్ద ఆపేడు.

"ఇదేమిటి?" అంది తాను ఆశ్చర్యంగా.

"దీన్ని చందనా రెస్ట్‌హవుస్ అంటారు. సింహాచలం వచ్చే పోయే యాత్రికుల సౌకర్యార్థం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం టూరిజం శాఖవారు యీ బంగళా నిర్మించేరు. ఇందులో సర్వసౌకర్యాలతో చక్కని బాత్‌రూములతో అయిదు గదులున్నాయి. ఒకటి రెండు మూడో నెంబరు గదులు క్రిందవి. నాలుగయిదు నెంబరుగదులు మేడ మీదవి! గదుల్లో మంచాలు, ఫోమ్ పరుపులు, డ్రెస్సింగ్ టేబిల్సు, మంచి వాలుకుర్చీలు వుంటాయి! కమ్మని భోజనం, రుచికరమయిన కాఫీ యిక్కడ ఆర్డరిస్తే సరసమయిన ధరకు లభిస్తుంది. రూము అద్దెకూడా చాలా తక్కువే! ఇది భూతాల గృహం కాదు! చాలా. యింకా వివరాలు చెప్పాలా?" అన్నాడు శ్రీకాంత్ గుక్క తిప్పుకో కుండా.

తాను నవ్వేసి అతని వెనకాల నడిచింది. మేడమెట్లు ఎక్కి ఒక గది తలుపులు తెరిచేడు. వాచ్‌మేన్ కాఫీలు తీసుకు వచ్చేడు.

"దేవుణ్ణి చూడటానికి వెళుతూ కాఫీలా?" అంది.

"మరేం ఫర్వాలేదు. మనసు పవిత్రంగా వుండాలికాని కాఫీ వలన మాలిన్యం అంటదులే?" అన్నాడు.

ఇద్దరూ కాఫీలు ముగించి కొండమీదకు వెళ్ళి దర్శనం చేసు కున్నారు.

ఆలయంలో వున్నంతసేపూ తమ యిద్దరినీ యెవరయినా గమనిస్తున్నారేమోనని ఇటూ అటూ భయంగా చూస్తూనేవుంది తాను తిరిగి రెస్ట్‌హవుస్‌కు వచ్చి వేడి భోజనం కమ్మగా తిన్నారు. ఎదురుగ ఆవరణలో వున్న చెట్టునుండి సంపెంగలు కోసి దోసిలినిండా పోస కుని తీసుకువచ్చాడు. తాను మంచంమీద కూర్చుంటే తన ఒడిలో

పోశాడు శ్రీకాంత్!

ఏకాంతంలో తనూ, శ్రీకాంత్! యింతకుముందు అతనితో చాలాసార్లు ఏకాంతంలో గడిపింది తను, అయితే అది బీచ్ ఒడ్డున! యిది, మూసివున్న గది, సంపెంగల పరిమళం మత్తెక్కిస్తోంది! ఎదురుగా పేము కుర్చీలో వెనక్కు జారగిలబడి కూర్చొని తనవంకే చూస్తున్నాడు శ్రీకాంత్. మెల్లగా లేచి సంపెంగలు మంచంమీద పోసి అతని వెనుక నిలబడి అతని ముఖంపైకి వంగింది. తన ఊపిరి అతని చెంపలకు తగిలేటంత దగ్గరగా తన ముఖం ఆన్చింది.

అతడు సూటిగా తన కళ్లలోకి చూస్తున్నాడు. రెండుక్షణాల తర్వాత పెదాలమీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. తాను రెండు చేతులతో అతన్ని బలంగా బంధించింది. శరీరం వశం తప్పుతోంది.

శ్రీకాంత్ సుతారంగా లేచి మెల్లగా తన చేతులు వదిలించుకుంటూ "ఇంక మనం బయలుదేరుదాం!" అన్నాడు.

ఇద్దరూ బయలుదేరి వచ్చేశారు. తనను సిటీబస్సు యెక్కించేశాడు.

ఆ క్షణంలో శ్రీకాంత్ వారించకపోతే తనకు తానుగా అతనికి లొంగిపోయి వుండేదే! యింటికి వచ్చి శ్రీకాంత్‌కు మనసులోనే వెయ్యి నమస్కారాలు పెట్టింది. అంతే, అలాంటి సంఘటన మరి జరగలేదు!

ఆలోచనల్లో తేలిపోతూ, అనుభూతులమధ్య నలిగిపోతూ నిద్రలోకి జారిపోయింది అరుణ!

తలక్రింద వుండాల్సిన దిండు నడిరేయి వచ్చేసరికి ఆమె గుండెలక్రిందా, చేతులమధ్యా నలిగి ఒరిగిపోయింది.

## 4

మరుసటిదినం మధ్యాహ్నాం అరుణ బోర్డుమీద బిజీగావుంది. కలకత్తానుండి కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు వచ్చేరు. ఆయన వచ్చే వరకూ విమానాశ్రయానికి కనీసం పది కాల్స్ కనెక్టు చేసివుంటుంది. తరువాత గేరేజ్‌నుండి స్పెషల్ కారు పంపించటానికి కాల్స్! ఆయన పర్యటన వివరాలకోసం ఊర్లోనుండి కనీసం ఓ వంద కాల్స్ వచ్చి

వుంటాయి. చేతులు పీకి నీరసం వచ్చేసింది. కేంటీనుకు ఫోన్‌చేసి కాఫీ తీసుకురమ్మంది. బోయ్ కాఫీతెచ్చి ఎదురుగా ట్రేలో వుంచేడు. కాఫీ త్రాగుదామని కప్పు అందుకునేసరికి మళ్ళీ బోర్డుమీద దీపం వెల్గింది. రింగ్‌తోబాటు ఎర్రదీపం వెలుగుతూ వుంటుంది. కార్డ్ 'ఇన్‌సర్ట్' చేసి 'కాల్' తీసుకుంటే కాని దీపం ఆరదు. కాల్ వెయిటింగులో వుండగా దూరాన్నుండి ఏ మేనేజరయినా చూస్తే తనకు తిట్లు తప్పవు. నీరసంగా హెడ్‌ఫోను సవరించుకుని "శ్రీ కెమికల్స్ ప్లీజ్!" అంది.

"అరుణా!" అవతలినుండి శ్రీకాంత్ స్వరం. అతడు నిన్న ఫోన్ చేయలేదని మనసులో అక్కసుగా వుంది. అతని స్వరం విన టంతో మనసులోని కోపమంతా బయటకు వచ్చింది. అతని పిలుపుకు సమాధానం చెప్పకుండా "శ్రీ కెమికల్స్" అంది మొండిగా.

అంతలో బోర్డుమీద మరో కాల్! ఆఫీసు మేనేజరు గది నుండి! ప్లాంటు ఆఫీసుకు కనెక్టు చేయమని! కనెక్షన్ యిచ్చి మళ్ళీ శ్రీకాంత్‌తో లైన్లోకి వచ్చింది.

"అరుణా! నేను శ్రీకాంత్‌ని! నిన్న ఫోన్ చేయలేదని కోపం వచ్చింది కదూ!"

"నాకెందుకు కోపం?"

"నీ కంఠస్వరం పోల్చుకోగలను లేవోయ్! సారీ! ప్లాంటులో 'మైన్ టర్బయిన్' బ్రేక్‌డౌను అయింది. నిన్న ఊపిరి తిరగనంత పని! అందులోనూ ఈవేళ డైరెక్టర్‌గారి విజిట్ కదా! అందువల్ల నే నిన్న ఫోన్ చేయలేకపోయాను. నిన్నరాత్రి రూమ్‌కు చేరుకునేసరికి తొమ్మిదయిపోయింది."

"ఫరవాలేదులే!" అతని అర్థింపుకు చల్లబడిపోయింది.

"సాయంకాలం సినీమాకు వస్తావా?"

"వద్దు! తిరిగివచ్చేక తొంభయి ప్రశ్నలు వేస్తుంది అమ్మ!"

"అయితే బీచ్‌కి రా! తొందరగా వెళ్ళిపోదువుగానిలే! నీతో మాట్లాడాల్సిన పని వుంది. సరిగ్గా ఆరుగంటల కల్లా రావాలి!"

"అలాగే, బోర్డు చాలా బిజీగా వుంది, బై!"

"బై!" అంటూ శ్రీకాంత్ ఫోన్ పెట్టేశాడు. లైను డిస్కనెక్టు చేసేసింది.

కాఫీ తీసుకొని గటగటా త్రాగేసింది.

అంతలోనే రాజమండ్రీనుండి ఆర్డరు బుక్‌చేస్తూ ట్రంక్‌కాల్! దాన్ని నోట్‌చేసుకుంది. ఆఫీసు మేనేజరు నుండి ఫోన్ వచ్చింది.

"అరుణా!"

"యస్ సర్!" అంది.

"ఆఫీసయ్యాక నా రూముకు రండి" ఆయన కంఠం గంభీరంగా వుంది

"వస్తానండీ!"

అరుణ గుండెల్లో రాయిపడింది. ఆఫీసు మేనేజరు రూముకు పిల్చేరంటే యేదో కొంప మునిగిందన్నమాటే! నాలుగు గంటల లోగానే టెలిగ్రామ్స్ టైపుచేసి డిస్పేచ్ ట్రేలో పడేసి బోర్డు కంట్రోలు స్విచ్ ఆఫ్‌చేసి తన కేబిన్‌లోంచి బయటకు వచ్చింది. తిన్నగా ఆఫీసరు గదివద్దకు వెళ్ళింది.

"మే ఐ కమిన్‌సార్!"

"ప్లీజ్ కమిన్!" అన్నాడు.

ఆఫీసు మేనేజరు పేరు విశ్వనాధంగారు. వయసు అయిదు పదులకు పైబడే వుంటుంది. తల ముగ్గుబుట్టలా నెరిసిపోయింది. కాని, ఒంట్లో జవసత్వాలు ఏమాత్రం తగ్గలేదు. వెంట్రుకలు నెరవకుండా వుంటే ఆయన సూటులో యువకుడిలాగే కన్పిస్తాడు. ఆయన కళ్ళద్దాలు సవరించుకుంటూ చిరునవ్వుతో "కూర్చో అమ్మాయ్!" అన్నారు.

అరుణకు భయం తగ్గింది. ఆయన ముఖం ప్రశాంతంగానే వుంది.

"సాయంకాలం బీచ్‌కి నేనూ రానా?" అన్నా డాయన నవ్వుతూ.

అరుణకు మతిపోయింది. సమాధానం ఏంచెప్పాలో తోచక ముఖం కందగడ్డలా చేసుకుంది.

"కోపం తెచ్చుకోకు! నువ్వు బోర్డుమీద కూర్చోని బిజీ అవరులో అంతంతసేపు ప్రేమ వ్యవహారాలు నడిపితే ఎలాగ?" అన్నాడు.

తను శ్రీకాంత్‌తో జరిపిన సంభాషణ ఈయన విన్నారన్న మాట! అదెలా సాధ్యం!

"ఆశ్చర్యపోకు! నిన్ను ప్లాంటు ఆఫీసుకు కనెక్టు చేయమంటే యింకేదో లైనుకు కనెక్టు చేశావు. మీ యిద్దరి మాటలూ నాకు వినిపించేయి. ఇదే సంభాషణ ఏ జనరల్ మేనేజరుగారి చెవినో పడివుంటే ఎలా వుండేదో వూహించు!" అన్నారాయన శాంతంగా.

"క్షమించండి సార్!" అంది ఏంమాట్లాడాలో తోచక.

"ఫర్వాలేదులే! శ్రీకాంత్ మంచివాడే! ఇంతకూ పెళ్లెప్పుడు?"

"ఇంకా నిర్ణయంకాలేదు. నాకూ, అతనికీ కుటుంబ బాధ్యతలు కొన్ని వున్నాయి. అవి తీరిపోయాక పెళ్ళి చేసుకుంటాం!"

"విష్‌యూ గుడ్‌లక్!"

"థ్యేంక్యూ సార్!" అంటూ కుర్చీలోనుండి లేచి "ఈ విషయం రహస్యంగా వుంచండి! దయచేసి ఎవ్వరికీ తెలియనివ్వకండి" అంది.

ఆయన నవ్వేశాడు "అంత భయపడితే ఎలా? ప్రేమికులకు ధైర్యం ముఖ్యం! ఫర్వారేదు, ఎవ్వరికీ చెప్పనులే!"

"వస్తానండీ!" అంటూ తలుపులు తెరుచుకుని బయటకు వచ్చింది. అదేసమయానికి ఎకౌంట్స్ సెక్షనునుండి యిందిర బయటకు వచ్చింది.

ఇద్దరూ కలిసి బస్సుస్టాపుకు వచ్చేరు.

ఇంటికి చేరుకుని, తండ్రిని పలుకరించి వచ్చి స్నానం ముగించింది. చీర మార్చుకుని కాఫీ త్రాగుతూవుంటే బయట కారాగిన చప్పుడయింది. కప్పు కిటికీ గూటిలోవుంచి ఆదరాబాదరాగా బయటకు వచ్చింది. నీలంరంగు అంబాసిడర్ కారు! తనకు పరిచయమున్న కారులాగే కనుపించింది. అందులోంచి మధుమూర్తి దిగేడు! "గుడ్ యీవినింగ్!" అంది ఆశ్చర్యాన్ని లోపలే కప్పిపుచ్చుకుంటూ.

మధుమూర్తి సేల్సు ఆఫీసరుగా తమ కంపెనీలోనే పని చేస్తున్నాడు. అతనికీ తనకూ అంతకుముందు పెద్దగా పరిచయం లేదు. ఆయన నెలకు వారం పదిరోజులు మాత్రమే ఆఫీసుకు వస్తాడు. మిగిలిన దినాలు కేంపుల్లోనే వుంటాడు. ఆయన నేరుగా తన యింటికి వచ్చేడంటే ఏదో విశేషమే!!

"గుడ్ యీవినింగ్ అరుణా!" అంటూ లోనికి వచ్చేడు.

మధుమూర్తికి సుమారు ముప్ఫయ్యేళ్ళు వుంటాయి! మనిషి స్ఫురద్రూపి! చూసే వాళ్ళని యిట్టే ఆకర్షిస్తాడు. ముఖం చిరునవ్వుతో ప్రశాంతంగా వుంటుంది. రంగు కాస్త నలుపు అయినా అందమయిన వాళ్ళ కోవలోకే వస్తాడు.

"రండి!" అంటూ లోనికి ఆహ్వానించి గోడకు ఆన్చివున్న గాడ్రేజ్ కుర్చీ వాల్చింది. చిందరవందరగావున్న దుప్పటిని మంచం మీద సర్దింది.

అతడు కుర్చీలో కూర్చుంటూ "మీనాన్నగారులేరా?"అన్నాడు.

"ఆయనకు ఆరోగ్యం బాగాలేదు. లోపల గదిలో వున్నారు."

"అరె! ఏమయింది?" ఆత్రంగా అడిగేడు.

"రెండేళ్ళక్రితం పక్షవాతం వచ్చింది. ఇంకా కోలుకోలేదు!"

"జానకిరామయ్యగారు మా మేస్టారు. ఆయన దగ్గర నేను చిన్నతనంలో చదువుకున్నాను. 'మధుకరమూర్తి' వచ్చేడని ఆయనతో చెప్పండి. ఆయనకు తెలుస్తుంది" అన్నాడు.

మధుకరమూర్తి!! తనకు పరిచమయిన పేరే!

"మీరు నంద్యాలలో వుండేవారుకదూ!" అని అడిగింది. చాలాకాలంనాటి సంగతులు లీలగా ఆమె మనసులో కదిలేయి.

"అవును, మీ యింటి కెదురుగావున్న యింట్లో వుండే వాళ్ళం. మీకు జ్ఞప్తి లేదేమో కాని మిమ్మల్ని ఎత్తుకుని నా భుజాల మీద మోశాను" అన్నాడు నవ్వుతూ.

అరుణ సిగ్గుపడిపోయింది.

"ఉండండి! నాన్నగారికి చెప్తాను" అంటూ తండ్రి గదిలోకి వెళ్ళి 'మధుకరమూర్తి' వచ్చినట్లు చెప్పింది.

"ఇలా యిక్కడ కుర్చీవెయ్యి!" అన్నాడాయన. తండ్రి కొట్టు గుమ్మం దగ్గిర కుర్చీ తెచ్చివేసింది.

మధుమూర్తి జానకిరామయ్యగారి దగ్గరగా వెళ్ళి "గుర్తున్నానా మేష్టారూ? నేను, మధుకరమూర్తిని!" అన్నాడు ఆప్యాయంగా.

"రా బాబూ! ఎంతవాడివయ్యేవ్? బాగున్నావా?" అంటూ పలకరించేరు.

తండ్రి ముఖంలోని నిండయిన ఆనందం చూసి విస్తుపోయింది అరుణ.

ఉపాధ్యాయులకి తమవద్ద చదువుకున్న వాళ్ళందరూ స్వంత పిల్లల్లాగే కనుపిస్తారు కాబోలు.

ఇద్దరూ పాత కబుర్లలోకి దిగేరు.

అరుణ కాఫీ తీసుకు వచ్చింది. "అనవసరంగా నా గురించి శ్రమ తీసుకుంటున్నారు. ఇవన్నీ ఎందుకు?" అన్నాడు మధుమూర్తి.

"ఫర్వాలేదు. తీసుకోండి!" అంటూ "నాన్నా! ఈయన మా కంపెనీలోనే సేల్సు ఆఫీసరుగా పనిచేస్తున్నారు" అంది తండ్రి వంక తిరిగి.

"మధు అంతా చెప్పేడమ్మా! నీ నుదుటిమీద ఆ మచ్చ ఏమిటో తెలుసా?" నుదుటిమీద చూపుడు వేలుతో తడుముకుంది అరుణ.

"నీ చిన్నతనంలో నిన్ను భుజాలమీద ఎక్కించుకుని తిప్పుతూ వీధి గుమ్మంమీద పడేశాడు. అప్పటికి నువ్వు నాలుగేళ్ళ పిల్లవి. గడప కొట్టుకుని నుదుటిమీద గాయమయింది. అది మానేసరికి నెల్లాళ్ళు పట్టింది."

"ఆవేళ మీరు నన్ను చింత బరికెతో బాదిన సంగతి మటుకు నేను మరిచిపోను!" అన్నాడు మధు నవ్వుతూ.

వాచీ చూపింది అరుణ. అప్పుడే అయిదుంపావు దాటిపోతోంది. తను ఆరుగంటలలోగా బీచ్‌కి వెళ్ళలేదు. శ్రీకాంత్ తనకోసం నిరీక్షిస్తూ వుంటాడు. తాను బయలుదేరాలి. కాని మధుమూర్తి యింతలో కదిలేటట్లు లేదు.

అరుణ కాలుగాలిన పిల్లిలా ఇటూ అటూ తిరగటం చూసి "మీకు బయటకు వెళ్ళే ప్రోగ్రాంవుంటే వెళ్ళిపోండి. నేను కాస్సేపు మేస్టారితో కబుర్లు చెప్తాను" అన్నాడు.

మనసులోనే అతనికి 'థాంక్స్' చెప్పి ఇంట్లోంచి బయట పడింది.

బీచ్ చేరుకునేసరికి అరు గంటల ఇరవై నిమిషాలయింది. "ఇరవై యుగాలు లేటు" అన్నాడు శ్రీకాంత్.

"నాకు జావా లేదు! బస్సుమీద రావాలి! అయినా, నీ కంటె నయమే! నిన్న ఫోన్ చేస్తానని చెప్పి ఈవేళ చేశావు!" అంది చిరు కోపంతో.

"కోప్పడకు సుందరీ! ఇవిగో, ఈ చేగోడీలు చే కొనుము!" అంటూ చేతిలోని కాగితం పొట్లం అందించేడు.

నవ్వుతూ యిసక మీద కూలబడి అతని దగ్గరనుండి పొట్లం అందుకుంది.

"ఇవెక్కడివి!"

"మా వూరినుండి ఒకాయన వస్తూంటే అమ్మ పంపించింది. ఆవిడ కమ్మని చేగోడీలు పంపితే, నాన్న కారంగా ఉత్తరం పంపిం చేరు. నిన్నరాత్రి రూముకు వెళ్ళేసరికి చేగోడీల సంచీ, యీ ఉత్త రమూ పట్టుకుని ఆ పెద్దమనిషి నా రూము దగ్గర వున్నారు."

"మీ నాన్నగారు ఏమంటారు?" అంది చేగోడీలు తింటూ.

"నువ్వే చదువు!" అంటూ శ్రీకాంత్ ఉత్తరాన్ని అరుణకు అందించేడు. ఉత్తరం విప్పింది.

"చిరంజీవి శ్రీకాంత్‌కు—

ఆశీస్సులు.

ఈమధ్య నువ్వు ఉత్తరాలు వ్రాయటం మానేశావు. ఏలూరు రావటం తగ్గించేశావు. కారణం తెలీదు.

మీ అమ్మ ఆరోగ్యం బాగులేదు తరచు మంచాన పడుతోంది. మీ చెల్లాయి పెళ్ళిగురించి చాలా ఆత్రుతగావుంది. ఆ బాధ్యత కాస్తా తీరిపోతే నాకూ హాయిగానే వుంటుంది. విజయవాడలో యీ మధ్య

ఒక సంబంధం చూసేను. కుర్రాడు వ్యవసాయం చేసుకుంటున్నాడు. కంకిపాడులో వాళ్ళకి పదెకరాల మాగాణీవుంది. మన విజయను చూసి ఆ కుర్రాడు ఇష్టపడ్డాడు. కట్నం ఆరువేలు కావాలన్నారు. ఈ సంబంధం ఖాయంచేస్తే మంచిది. పెళ్ళి ఖర్చులకు కనీసం మరో నాలుగు వేలయినా వుండాలి. పదివేలు పట్టుకుంటే గాని ఈ తతంగం పూర్తికాదు.

ఇక—నీ పెళ్ళి విషయంలో నువ్వేమీ మాట్లాడటం లేదు.

పదిహేను వేలవరకూ కట్నం ఇస్తామంటూ బోలెడు సంబంధాలు వస్తున్నాయి నీకు. నువ్వు ఒప్పుకుంటే మనం విజయ పెళ్ళి సులువుగా చెయ్యగలం పరిస్థితి గ్రహించగలవని నా నమ్మకం. ఒక్కసారి త్వరలో ఏలూరురా!

—బలరామయ్య"

చదవటం ముగించి శ్రీకాంత్‌కు అందించింది.

"జవాబు ఏం రాద్దామను కుంటున్నావ్?" అంది.

"నువ్వే చెప్పు!" అన్నాడు.

"ఏదో మంచి సంబంధం చేసేసు కుంటానని రాయి! కట్నం ఎందుకు వదులు కోవాలి?"

అరుణ వంక సీరియస్‌గా చూసేడు శ్రీకాంత్.

అరుణ నవ్వేసింది.

"అరూ! ఇది చాలా గడ్డు సమస్య! బయట పడేమార్గం ఆలోచించాలి. ఏదో విధంగా నా మెడలువంచి పెళ్ళిచేసే సామర్ధ్యం మా నాన్నకి వుంది. చెల్లాయి వివాహానికి ఆర్ధికంగా ఆదుకో గల్గితే తప్ప నా వివాహం వాయిదా వెయ్యటం కుదరదు. ముందు విజయ పెళ్ళి సవ్యంగా జరిగిపోతే నిలకడ మీద మనసంగతి చెప్పేస్తాను." కొంతసేపు ఇద్దరిమధ్యా మౌనం చోటు చేసుకుంది.

"నువ్వే ఆరువేల రూపాయలు కట్నం యిచ్చి నన్ను పెళ్లి చేసుకో రాదు! ప్రస్తుతం నా మార్కెట్టు రేటు పదిహేను వేలు! నీకు కారు చౌకగా దొరికేస్తాను!" అన్నాడు శ్రీకాంత్.

అతడెంత చిలిపిగా అన్నా, ఆ మాటలతో అరుణకు కంట్లో నీళ్ళు తిరిగేయి. బిక్క మొహంతో అతని వంక చూస్తూ వుండి

పోయింది. ఆమె బుగ్గమీద చిటికెవేసి "చేకిట్ ఈజీ! నువ్వు అలా అయిపోకూడదు" అంటూ రుమాలుతో ఆమె కళ్ళువొత్తేడు.

"నా దగ్గర బ్యాంకులో వేసినవి నలుగువేల రూపాయలు వున్నాయి. ఇంకో రెండువేలు అప్పు చెయ్యాలనుకుంటున్నాను. ఆ మొత్తం తీసుకెళ్ళి నాన్నకిస్తే ముందు విజయ కట్నం సమస్య తీరిపోతుంది. ఓ సంవత్సరం జాగ్రత్తగా వుంటే అప్పుతీర్చి పాశేస్తాను." అన్నాడు.

అరుణ మెల్లగా అంది. "నా మూలంగా చాలా యిబ్బందులు వస్తున్నాయి కదూ!"

"ఎందుక్కాదు! బోలెడు యిబ్బందులు! అసలు నా మతి పూర్తిగా పోతోంది. నీ గురించి ఆలోచిస్తూ నిన్న ప్లాంటులో కాలు జారి పడ్డాను! కాస్త తేడా వస్తే నడుం విరిగిపోయి వుండేది. ఇవన్నీ యిబ్బందులే!"

"ఈ వేళ బాక్సు ముందుండగా ఏం జరిగిందో తెలుసా?" అంది.

శ్రీకాంత్ కుతూహలంగా అరుణవైపు చూసేడు.

"నువ్వు నాకు ఫోన్ చేశావు కదా! అదే సమయంలో ఆఫీసు మేనేజరు విశ్వనాథంగారు ప్లాంటుకు 'కాల్' కనెక్టు చేయమన్నారు. పొరపాటున ఆ 'కార్డ్' నీ 'కాల్'తో కనెక్టయింది. మన సంభాషణ అంతా ఆయన విన్నారు. ఆఫీసయ్యాక రూముకు పిల్చి ఏమన్నారో తెలుసా? ఆయన కూడా సాయంకాలం బీచ్‌కి వస్తానన్నారు" అంటూ నవ్వింది.

"రమ్మని చెప్పాల్సింది. పాపం, ముసలాయన సంబర పడ్డాడేమో" అన్నాడు శ్రీకాంత్.

"ఛీ! పో!" అంది అరుణ సిగ్గుతో తల వంచుకుంటూ! కొంతసేపు గడిచేక ఇద్దరూ యిసుకలోంచి లేచి వెళ్ళి ఫిష్‌కేంటీను దగ్గర నిలబడి ఐస్ కేండీస్ తిన్నారు. కబుర్ల మధ్యలో కాలమే తెలియలేదు. తొమ్మిన్నరగంటల ప్రాంతంలో అరుణను పదోనెంబరు బస్సు ఎక్కించి జావా స్టార్టుచేసి వెళ్ళిపోయేడు. వెళ్ళి పోయేముందు

మరోసారి అడిగేడు "అరుణా! ఇంటి దగ్గర్లో డ్రాప్ చేయనా?" అని.

"వద్దు బాబూ!" అంటూ సిటీబస్ ఎక్కేసింది. వాచ్ హౌస్ వద్ద దిగి నడచి జగదాంబ సెంటరుకు వచ్చింది. దొండపర్తివైపు వెళ్ళే బస్సులన్నీ చాలా రద్దీగావున్నాయి. అప్పటికే సమయం పది దాటిపోతోంది. రెండు మూడు బస్సులు వెళ్ళిపోయాయి. బస్సుల్లో ఎక్కటం సాధ్యంకాని పనిలా కనుపించింది. శ్రీకాంత్ యింటి దగ్గర్లో దింపేస్తా నంటే వినకుండా మొండిగా బస్సులకోసం యత్నించి నందులకు తనను తానే నిందించుకుంది.

అలసటగా నీరసంగా వుంది అరుణకు. దగ్గర్లోవున్న రిక్షాను కేకేసింది. "దొండపర్తి సెంటరుకూ వస్తావా?"

"వస్తాను. రెండున్నర యివ్వండి!"

"రూపాయిన్నర యిస్తాను!" అంది.

"రాలేను!" అంటూ వెళ్ళిపోయాడు వాడు.

అంతలోనే మరో రిక్షావాడు దగ్గరకు వచ్చేడు. "ఎక్కండి నేను తీసుకు వెళ్తాను!" అన్నాడు.

"దొండపర్తి సెంటరుకు రూపాయిన్నర యిస్తాను!" అంది.

"ఎంతో కొంత ఇవ్వండి." అంటూ సీటు సరిచేశాడు.

రిక్షా ఎక్కి కూలబడింది అరుణ. రిక్షా కదలి తొందరగా సాగిపోతోంది. ఆలోచనల్లో మునిగి వున్న అరుణకు కొంతసేపు గడిచాక రిక్షా వెడుతున్న దారి చూస్తే అనుమానం కలిగింది. వెనుక తెర తీసి చూపింది. డాబాగార్డెన్స్ వైపు వెళ్ళకుండా తిన్నగా తీసు కెళుతున్నాడు వాడు.

"ఏయ్! ఇలా ఎక్కడికి! దొండపర్తి వెళ్ళాలి" అంది.

"ఆ సీల మెట్టుమీదనుండి వెళ్దామండి! ఇక్కడ స్టూడెంటు కుర్రాళ్ళ లాడ్జింగు వుంది. అందరూ మంచి డబ్బున్న కుర్రాళ్ళే! జలసా చేసుకోవచ్చు" అన్నాడు రిక్షా తొక్కుతూనే.

అరుణకు వ్యవహారం అర్థమైంది. గుండెల్లో రాయి పడింది. చుట్టూ కలయజూసింది. దూరాన సెంట్రల్ జైలు గోడ కనిపిస్తూంది.

దగ్గరలో జనం లేరు. రిక్షావాడు అఘాయిత్యానికి దిగితే ఏం చెయ్యాలి? ఒళ్ళంతా చెమటలు పోశాయి.

"మీరు 'ఊ' అనండి. రెండు గంటలు ఆళ్ళ గదిలో వుంటే శాలు! రొండొంద లిప్పిస్తాను. ఓ పాతిక రూపాయలు నాకు పారెయ్యండి" అంటూ వెనక్కి తిరిగి పళ్ళికిలించేడు.

"రిక్షా ఆపు!" అంది అరుణ చికాకుగా.

"మీరు ఏ సంగతీ చెప్పేవరకూ బండి ఆగదండి. అరిచి అల్లరి చేసేరంటే మీరే లాడ్జింగుకు తీసుకువెళ్ళమన్నారని చెప్తానండి" అంటూ బెదిరించటం ఆరంభించేడు. రిక్షా వేగంగా తొక్కుతున్నాడు వాడు.

అరుణకు మెదడు పనిచేయటం మానేసింది. ఎదురుగా ఏదో కారు వస్తోంది. వెంటనే ఏదో నిర్ణయానికి వచ్చినదానిమల్లే ముందుకి వంగి ఒక్కసారిగా తన బలమంతా వుపయోగించి రిక్షావాడ్ని ఎదరకు తోసేసింది. హేండిలు వదలి ముందు చక్రం మీదనుండి ఒక్కవుదుటున కింద పడ్డాడు. రిక్షా వంకరలు తిరిగి రోడ్డు ప్రక్కకు వెళ్ళిపోయింది. అరుణ రిక్షాలో నుండి క్రిందకు దూకి రొప్పుతూ ఎదురుగా వచ్చే కారుకు చేతులు అడ్డంపెట్టి ఆపమన్నట్లు అరచింది.

దగ్గరకు వచ్చిన కారు కీచుమనే శబ్దంతో ఆగిపోయింది.

"హెల్ప్! హెల్ప్!" అంటూ డ్రయివింగు సీటు దగ్గరకు వెళ్ళింది. కారు ముందరి తలుపు తెరుచుకుని ఒక యువకుడు కిందకి దిగేడు. నేలమీదనుండి లేచి పారిపోతున్న రిక్షావాడ్ని చేజిక్కించుకుని, నడ్డిమీద బలంగా తన్నేడు.

మళ్ళీ బంతిలా దొర్లిపోయేడు రిక్షావాడు.

"దొండపర్తి తీసుకు వెళ్ళమని బేరం ఆడితే ఇలా దారి మళ్ళించి అల్లరి చేస్తున్నాడు. స్టూడెంట్సు లాడ్జికి రమ్మని గొడవ చేస్తున్నాడు."

రొప్పుతూ ఏవేవో మాటలు మాట్లాడి ఏడుపు ప్రారంభించింది అరుణ.

ఆమె మాటలు వినే ధోరణిలో లేడు ఆ యువకుడు. పైకి

లేద్దామని ప్రయత్నించిన రిక్షావాడికి మరో రెండు తాపులు ఇచ్చేడు.

"ఆడపిల్లల్ని అల్లరి పెడతావా రాస్కెల్!" అంటూ క్రింద పడినవాడి నడ్డిమీద బూటు కాలుతో అణచిపెట్టి అడిగేడు.

"ఇంకెప్పుడూ చెయ్యను. నన్ను వదలండి బాబోయ్" అంటూ రిక్షావాడు ఏడుపు లంకించుకున్నాడు. ఇంతలో నలుగురయిదుగురు చుట్టూచేరి సంగతి తెలుసుకుని రిక్షావాడిమీద పడ్డారు. ఆ యువకుడు కారు దగ్గరకు వచ్చి బేక్‌డోర్ తెరిచి పట్టుకున్నాడు. లోపలి దీపం వెలిగింది. ఆ యువకుని ముఖం వంక చూసింది.

అతడు మధుమూర్తి.

"మీరా!" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"కారు ఎక్కండి."

"ఫర్వాలేదు, నడిచివెళ్ళిపోతాను. వేళకు దేముడిలా వచ్చి ఆదుకున్నారు. లేకపోతే నా బ్రతుకేమయ్యేదో!" అంది.

"ముందు కారులో ఎక్కండి" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు మధుమూర్తి.

సమాధానం చెప్పలేక వెనక సీట్లో కూలబడింది అరుణ. నడిచి వెళ్ళిపోతానని చెప్పిందేకాని నిలబడటానికి కూడా ఓపిక లేదు ఆమెకు.

డ్రైవింగ్ సీట్లో కూర్చుని డోర్ లాక్‌చేసి కారు స్టార్టు చేశాడు మధుమూర్తి.

"మీకు నాలుగడుగులు కూడా కదిలే ఓపిక లేదని అలసిపోయిన మీ ముఖమే చెపుతూంది. నా దగ్గర అంత మొహమాటమెందుకు? అయినా, ఈ సమయంలో మీరు ఒంటరిగా వెళ్ళడం మంచిది కాదు. రెండు నిముషాల్లో మా రూమ్ చేరుకుంటాం. ఐదు నిమిషాలు రిలేక్స్ అయ్యాక మీ యింటి దగ్గర మిమ్మల్ని డ్రాప్ చేస్తాను" అన్నాడు.

"మీరు నా గురించి అనవసరంగా శ్రమ తీసుకుంటున్నారు" అంది.

మధుమూర్తి సమాధానం చెప్పలేదు.

ఇంత రాత్రివేళ ఇలా వంటరిగా వస్తున్నందుకు అతడు తన గురించి ఏమనుకుంటున్నాడో! "మా ఫ్రెండ్ యింటికి పార్టీకి వెళ్ళేను. అక్కడనుండి ఆమె సినీమాకు వెళ్దామంది. అందుకని ఇలా ఆలశ్యమయిపోయింది" అంది మెల్లగా సంజాయిషీ చెపుతున్నట్లు.

అంతలోనే విశాలమయిన ఆవరణగల ఇంటి ముందు కారాగింది. హారన్ విని ముందు వరండాలో కునికిపాట్లు పడుతున్న కుఱ్ఱాడు లేచివచ్చి గేటు తలుపులు బార్లా తెరిచేడు.

కారు లోనికి తీసుకువెళ్ళకుండా బయటే ఆపి తలుపులు తెరచి 'దిగండి' అన్నాడు మధుమూర్తి. అరుణ కారుదిగి అతణ్ణి అనుసరించింది.

"శంకరం! కారు బయటే వుండనివ్వు! మళ్ళీ బయటకు వెళ్లాలి" అంటూ వరండాలోనుండి మేడమెట్లు ఎక్కి పైగది తలుపులు తెరిచి దీపం వెలిగించేడు మధుమూర్తి.

"అలా కూర్చోండి" అంటూ సోఫా చూపించేడు. ఆమె సోఫాలో కూర్చుంది.

"ఇదే నా గది. దీనిప్రక్కనే వంటిల్లు వుంది. అంతే!" అంటూ ప్రక్క గది తలుపులు తెరుచుకుని ఆవలకు వెళ్ళేడు.

అరుణ గది అంతా కలయ చూసింది, శుభ్రంగా చూడ ముచ్చటగా వుంది ఆ గది. తూర్పువైపున వున్న గోడకు పెద్ద పుస్తకాల రేక్. దానినిండా అందమయిన రీతిలో పుస్తకాలు సర్ది వున్నాయి. తలుపులు తెరిచేసరికి ఎదుటివారిని ఆహ్వానిస్తున్నట్లు ముకుళిత హస్తాల బొమ్మ, ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేయబడినది గోడకు వుంది. అందమయిన అతివ చేతులమధ్య అరవిరిసిన కలువ పువ్వు! ఎంతో హృద్యమంగా వుంది అది. ఒకమూల టేబిలు మీద రేడియో! దానిమీద తెల్లని రాధాకృష్ణుల విగ్రహం! మరోమూల దోమతెర కట్టిన మంచం వుంది. ఇవిగాక మూడు సింగిల్ సోఫాలు. నేలమీద అందమయిన కార్పెట్ పరిచి వుంది.

ముఖం కడుక్కొని తువ్వాలుతో ఒత్తుకుంటూ లోనికి వచ్చేడు

మధుమూర్తి. అంతలోనే శంకరం ఫ్లాస్కు రెండు కప్పులు తెచ్చి టీపాయ్‌మీద వుంచేడు. మధుమూర్తి టవలు స్టాండుమీద పడేసి ఫ్లాస్కు మూత తెరిచి వేడిపాలు రెండు కప్పుల్లోనూ ఒంపేడు. ఒకటి అరుణకు అందించి మరోటి తాను తీసుకున్నాడు.

"ప్రతి విషయంలోనూ ఎంతో విజ్ఞానాన్నీ, అభివృద్ధినీ సాధించిన మనం ఆడవాళ్ళను గౌరవించటంలోనూ వాళ్ళయెడల సభ్యత చూపించటంలోనూ ఎంతో వెనుకబడే వున్నాం. అది మన దౌర్భాగ్యం!" అన్నాడు పాలు త్రాగటం ముగించి కప్పు టీపాయ్ మీద వుంచుతూ.

అరుణ మాట్లాడలేదు.

మధుమూర్తి ఫుల్‌షర్టు విప్పి బుష్‌కోటు తొడుక్కుని చెప్పుల్లో కాళ్ళు దూరుస్తూ "పదండి! మీ ఇంటి దగ్గర దింపి వస్తాను" అన్నాడు.

"మీరు చేస్తున్న సహాయాన్కి కృతజ్ఞత ఎలా చెప్పాలో అర్థం కావటం లేదు" గొణుగుతున్నట్లు మెల్లగా అంది. విననట్లే వూరుకున్నాడు.

"శంకరం? నేను ఈవిడ్ని దింపిరావాలి. గది తలుపులు దగ్గరగా పెడతాను. చూసుకో! రేపు నా కేంప్‌కు బట్టలు రెడీ చేశావా?" అని అడిగేడు.

"ఇస్త్రీచేసి బ్రీఫ్‌కేసులో సర్దేశాను సార్!" అన్నాడు శంకరం.

మధుమూర్తి బయటకువచ్చేడు. ఆమె అతణ్ణి అనుసరించింది. అరుణ యింటిముందు కారాపి బేక్‌డోర్ తెరిచి "దిగండి! మళ్ళీ నన్ను మీ యింటిలోనికి రమ్మనకండి! ఇలా గౌరవాలు చేసుకుంటూ కూర్చుంటే రాత్రి తెల్లవార్లూ మనం మన యిళ్ళమధ్య తిరగాలి" అన్నాడు.

అరుణ చిన్నగా నవ్వి "థేంక్యూ!" అంది.

"గుడ్‌నైట్!" అంటూ వెళ్ళిపోయేడు మధుమూర్తి.

# 5

రెండు నిమిషాలపాటుబాటు రోడ్డుమీద నిలబడి కారు కదలి

వెళ్ళిపోయినవైపే చూస్తూ వుండిపోయింది అరుణ. తరువాత మెల్లగా లోనికి వచ్చింది. తనవంకే కళ్ళు విప్పార్చుకుని చూస్తోంది తల్లి. ఆమె ముఖంనిండా ఆనందం, తృప్తి తొణికిసలాడుతున్నాయి. "నువ్వు అక్కడే నిలడమ్మా! ఒక్కక్షణం!" అంటూ లోనికి వెళ్ళి పిడికెడు ఉప్పు తెచ్చి దిష్టితీసి పారేసింది.

అరుణకు ఇదంతా చికాకుగా, సంభ్రమంగా వుంది.

"ఏమిటమ్మా యిదంతా! నాకేం దిష్టి తగల్లేదులే! అయినా నా మెడనిండా బంగారు నగలు కులుకుతున్నాయా? లేకపోతే ఇన్నాళ్ళు లేని అందాలు ఈవేళ నాకు కొత్తగా వచ్చాయా? ఈ చాదస్తంఅంతా ఏమిటి?" విసుగ్గా అంది.

"నగల్లేకపోతేనేం? నీకున్న అందం చాలదూ, నీకు దిష్టి తగలటానికి! ఈవేళ నీ ముఖంనిండా పెళ్ళికళే తల్లీ! మధుగారు కారు తలుపు తెరిచి పట్టుకుంటే యెంత హుందాగా దిగుతున్నావు? చూడ ముచ్చటగా వున్నారు మీరిద్దరూ! అంతా పూర్వజన్మ పుణ్యం!...."

"అమ్మా? ఏమిటా మాటలు?...." గట్టిగా అరిచింది అరుణ. తల్లి తనను గౌరవిస్తుందో లేకపోతే అనుమానించి ఎగతాళిచేస్తోందో కూడా కొంతసేపు అర్థంకాలేదు.

తల్లి ముఖం ముడుచుకుంది.

"అమ్మ! రిక్షాలో వస్తుంటే రిక్షావాడు అల్లరి చెయ్యబోయాడు. ఆ దారినే వెళ్తున్న మధుమూర్తిగారు భగవంతునలా ఆదుకున్నారు. ఎందుకయినా మంచిదని యింటిదగ్గర తీసుకొచ్చి దింపేరు. అంతే కాని....యింకేం కాదు...." గ్రుడ్ల నీరు కుక్కుకుంటూ చెప్పింది.

మాట్లాడుతూవుంటే ఆమె కంఠం రుద్ధమయింది.

"పిచ్చిపిల్లా! నేను మాత్రం ఏమన్నాను? మధుమూర్తిగారు దేవుళ్లాటి వాడనే అన్నాను. నిన్నేకాదు, మనందరినీ ఆదుకుంటున్న దేముడు! మనందరి పాలిట వరం. లేకపోతే మనకు ఇంత అదృష్టం కల్గుతుందా?" అంటూ వుంటే లోపలినుండి "అరుణా!" అంటూ తండ్రి పిలుపు వినిపించింది.

మెల్లగా తండ్రి గదివైపు కదిలింది అరుణ.

ఆమెకు అంతా అయోమయంగా వుంది. తల్లి మాటలు ఆమెక

అంతుపట్టడంలేదు. తల్లి ముఖంలో తృప్తి చూశాక ఆమె ఎగతాళిగ

మాట్లాడటం లేదేమో అనిపించింది. అయితే యిదంతా ఏమిటి?

మధుమూర్తి అందరిపాలిట వరం యెలా అయ్యేడు?

అందరికీ దేముడని తల్లి అతణ్ణి యెందుకు పొగుడుతోంది

ఇద్దరూ చూడముచ్చటగా వున్నారనటంలో ఆమె ఆంతర్య

ఏమిటి?

తండ్రి గదిలోకివెళ్ళే ఇరవైసెకన్ల సమయంలోనూ మనసుల

యెన్నో సందేహాలు ప్రశ్నలూ ఉత్పన్నమయ్యేయి. సంగతి కొం

వరకూ అవగాహనకు వచ్చేసరికి కాళ్ళలోనుండి వణుకు ప్రారం

మయింది.

'కొంపదీసి....' అనుకుంది మనసులోనే.

తండ్రి మంచంమీద కూలబడి "ఎలా వుంది నాన్నా?" అ

అడిగింది.

"నా రోగం అంతా మాయమయిపోయిందమ్మా! లేచి తిర

లేనన్నమాటేగాని, మనసంతా తృప్తిగా వుంది. ఈ ఆనందాని

మించిన ఆరోగ్యం వేరే ఏముంటుంది? నువ్వు చాలా అదృష్టవం

రాలివమ్మా!" అన్నారాయన వణికే కంఠంతో.

"ఏమిటిదంతా! నాకేం అర్ధం కావటంలేదు. నేను అదృ

వంతురాలినే! కాదని యెవరన్నారు?"

"మధుమూర్తి నిన్ను కారులో తీసుకువచ్చి దింపేడా?

అన్నారాయన

అరుణ జరిగినదంతా చెప్పింది.

"నిజమేనమ్మా? వేళకు ఆయన రాబట్టే సరిపోయింది. అత

రూములో నీతో ఏవైనా విషయాలు మాట్లాడేడా?"

"ఏ విషయాలు?" అని అడిగింది.

"అహ! ఏమీలేదు!...." అంటూంటే తండ్రి మాట

అడ్డంపడి "వేడి పాలు ఓ కప్పు యిచ్చేరు త్రాగమని! వెంటనే కా

మెక్కించి యిక్కడ దింపేశారు" అంది అరుణ, ఇంకేమీ మాట్లాడ
కేదని సూచిస్తూ.

"మధుమూర్తి చాలా రోజులుగా మీ ఆఫీసులో పని చేస్తు
న్నాడట! ఒక్కరోజయినా నాతో అనలేదేం?"

"ఈవేళ సాయంకాలంవరకూ నేనూ ఆయన్ను గుర్తుపట్ట
లేదు. ఆఫీసు కౌంటరులో కూర్చుంటే అందరివంకా చూసినట్టే
ఆయనవంకా చూడటం, అంతే!"

"నువ్వంటే అతనికి యెంతో సదభిప్రాయం వుంది. నీలా
ణకువగా జాగ్రత్తగా పని చేసుకు వెళ్ళిపోయే అమ్మాయి ఆఫీసులో
యింకెవరూ లేరంటూ నీ గురించి బోలెడంత చెప్పేడు. నీ గురించిన
వివరాలు యెప్పటికప్పుడు తెలుసుకుంటూనే వున్నాడట. అయితే,
కొరందినాల క్రితమే నా గురించి కూడా తెల్సిందట! మాట్లాడి పోదా
మని వచ్చేడు! అరుణా!....అతడు నిన్ను పెళ్ళి చేసుకుంటాడట!
నందంతో అంగీకరించేను...."

అరుణ కొయ్యబారిపోయింది!!

ఇక, తండ్రి చెప్తున్నదేమీ ఆమెకు వినిపించటంలేదు.

ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది!

"నాతో ఒక్కమాటయినా చెప్పకుండా యెందుకు ఒప్పు
న్నావు?" అంది మెల్లగా.

"నువ్వు నా మాట కాదనలేవనే ధైర్యం నాకుంది. అయినా
యిష్టంకూడా అడిగి చెప్పమన్నాడు మధుమూర్తి. ముందుగా,
న్నే కలిసి యీ విషయం చెప్పాలనుకున్నాడట! అది సభ్యతగా
ండదనిపించి వివరాలు తెల్సుకుంటే నా సంగతి తెలిసిందట! నాకేదో
పకారం చెయ్యటంకోసం ఈ నిర్ణయం తీసుకోలేదనీ, తనకి
వ్వంటే యిష్టం యేర్పడిందనీ చెప్పేడు. మాకు అంగీకారమయితే
తోకూడా మాట్లాడమన్నాడు. అతడు ఎంతో సంస్కారవంతు
మ్మా! ఏం? అతడంటే నీకు యిష్టంలేదా?" అడిగేరు.

"నాకు కొంత వ్యవధి కావాలి. నన్ను కూడా కొంచెం
లోచించుకోనివ్వండి నాన్నా! అయినా, యింతలో నాకు పెళ్ళి

చేసుకోవాలని లేదు. నేను పెళ్ళి చేసుకుని నా దారి చూసుకుంటే
మీరూ, అమ్మ, తమ్ముళ్లు యేమైపోతారు?నాకంత స్వార్థంలేదు. ఈ
కుటుంబం యేదో ఒడ్డున పడితేగాని, అలాంటి నిర్ణయం ఏమీతీసుకో
దల్చుకోలేదు" అంది మెల్లగా.

ఈ గండం నుండి బయట పడటానికి మరో మార్గం
కన్పించటంలేదు.

మధుమూర్తి తనతో కలిపి వున్నంతసేపూ ఈ భావం ఏమీ
వ్యక్తం చేయలేదు!

అయితే, యింటిలో తనకు కావల్సిన పునాది వేసుకువెళ్ళేడు
మధుమూర్తి యెడల తనకు కోపంలేదు. అసహ్యం అంతకంటే
లేదు. అతడు యెంతో సంస్కారవంతుడని ఇప్పుడు జరిగిన సంఘ
టనే ఋజువు చేసింది. అయితే మనసు అర్పించేముందు ఆలోచిం
వలసినవి యెన్నో వున్నాయి.

అదీకాక తన మనసును యేనాడో శ్రీకాంత్‌కు అర్పించింది
అతనికి తనంటే తగని ప్రేమ. తనకోసం ఏమైనా చేస్తాడు. త
కున్న తొందరపాటు, కంగరు అతనికి లేవు. నిదానంగా ఆలోచిం
తెలివిగా సమస్యలను పరిష్కారం చేయగల సామర్థ్యం అతని
వుంది. అతడులేని భవిష్యత్తును తాను ఊహించుకోలేదు.

అయితే మధుమూర్తికివున్న ఆస్తిపాస్తులు శ్రీకాంత్‌కులేవు

అంతేకాదు, ఉద్యోగం కూడా ప్రస్తుతం అంత హోదా
అయినదికాదు. అయితే, తర్వాత ప్రమోషన్లు తెచ్చుకుని ఉన్న
స్థితికి వెళ్ళక మానడు!

మధుమూర్తి ఆస్థిపాస్తుల్నీ, హోదానీ చూపి యీ సరికే త
తండ్రులు ఓ నిర్ణయాన్కి వచ్చేరు. ఇప్పుడు తన అభిప్రాయ
చెప్పినా వారికి దాని యెడల గౌరవం మిగలదు. ఎలాగో మెడ
వంచి ఈ సంబంధం ఖాయం చేయటానికే ప్రయత్నిస్తారు.

తాను శ్రీకాంత్ స్థానంలో మరోవ్యక్తిని ఊహించుకో లేదు

ఆలోచనలు మనోసముద్రంలో తిమింగలాలకు మల్లే క
లాడు తున్నాయి. రాబోయే తుఫాను ఎలా ఎదుర్కోవాలో అర్థ

ావటం లేదు. ప్రస్తుతానికి ఈ విషయం వాయిదా వెయ్యటం కంటె
ఉత్తమమయిన మార్గం తోచలేదు. అంతవరకూ మౌనంగా అక్కడే
నిలబడి వింటున్న తల్లి అంతలో జోక్యం కలుగ జేసుకుంది.

"ఆడపిల్లవు కదా, నువ్వు మాత్రం ఎంతకాలం మమ్మల్ని
ఆదుకుంటావు? ఏనాటికయినా పెళ్ళి చేసుకుని ఓ అయ్య యింటికి
వెళ్ళక తప్పదు! మా కుండే కష్టాలు మా కెప్పుడూ వుంటాయి.
నువ్వు కూడా యీ యింటిలో ఎందుకు మగ్గిపోవాలి! అయినా,మధు
మూర్తి చాలా మంచివాడు. నిన్ను పెళ్ళి చేసుకున్నాక మన కుటుం
బాన్ని తప్పక ఆదుకుంటాడు. నీ తమ్ముళ్ళకి ఉద్యోగాలు కూడా
వేయిస్తాడు. ఈ అవకాశం వదులుకుంటే మళ్ళీ యీ జన్మలో మరో
అవకాశం రాదు" అంది.

అరుణకు తల తిరిగిపోతోంది!

తల్లి ఆలోచనలు చాలా దూరం వెళ్ళేయి. మధుమూర్తి
మాటలు వీళ్ళ మీద బాగా పనిచేశాయి. అతనికున్న కారు, హోదా
ఓటి మైకం పూర్తిగా కమ్మేసింది వీళ్ళకు! తనెంత చెప్పినా వ్యర్థమే.
నెరికగా ఆలోచించి తన నిర్ణయాన్ని తెలివిగా తెలియజెయ్యాలి!

మాట తప్పించటం కోసం మంచం మీదనుండి లేచి "నాకు
ఆకలవుతోందమ్మా అన్నం వడ్డించు!" అంది.

"అంతా సిద్ధంగా వుంది. ఈ సంబరంలో పడి నీ ఆకలి
సంగతే మరిచి పోయాను. రా తల్లీ!" అంటూ వంటింటివైపు
కదిలి పోయిం దావిడ! ఆకలవుతోందని కంచం దగ్గర కూర్చుందే
కాని అరుణకు తిండి దిగలేదు. విస్తట్లో మెతుకులు వేళ్ళతో కెలికి
మజ్జిగ తాగి లేచిపోయింది.

"ఆకలవుతోందని వడ్డించ మన్నావు. ఒక్క మెతుకయినా
ముట్టకుండా లేచిపోయావు. నీ సంగతి నాకేం అర్థం కావటంలేదు!"
అంటూ అదోలా చూసింది తల్లి.

'నీకేమిటి? నా సంగతి నాకే అర్థం కాకుండా వుంది!' అని
గొణుక్కుంటూ గదిలోకి వెళ్ళిపోయింది అరుణ. మంచం మీది దిన
పత్రిక కొంతసేపు తిరగేసింది. కాని దానిమీద మనసు నిలవటంలేదు

అద్దం మీద ఆవగింజల్లా ఆలోచనలు చెదిరిపోతున్నాయి. తనకు మధుమూర్తిని పెళ్ళాడే ఉద్దేశం లేదని తల్లి తండ్రులకు చెప్పాలి. శ్రీకాంత్‌కు మనసిచ్చినట్లు తెలియజేయాలి!

ముందుగా యీ విషయం శ్రీకాంత్‌కి చెప్తే మంచిదనిపించింది. అతని సలహా కూడా స్వీకరిస్తే బాగుంటుందనే అభిప్రాయం కల్గింది. నిద్ర పట్టేలోగా మరో గంటసేపు మనసు ఆలోచనలతో విల విల్లాండి.

మరునాడు ఉదయం లేచి యాంత్రికంగా పనులన్నీ ముగించుకుంది. ఆఫీసుకు వెళ్తూ అలవాటు ప్రకారం తండ్రి గదివద్దకు వెళ్లింది.

"ఇలా కూర్చో అరుణా!" అన్నారాయన.

అరుణ తండ్రి ప్రక్కన మంచంమీద కూలబడింది.

"నేనొక ప్రశ్న అడుగుతాను. అబద్ధం ఆడకుండా నిజం చెప్తావా?"

సూటిగావుంది తండ్రి ప్రశ్న!

మౌనంగా తలవూపింది అంగీకార సూచకంగా!

"నీకు పెళ్ళి చేసుకునే యీడొచ్చింది. నా అసమర్ధత వలన, అనారోగ్యం వలన అది నాచేతుల మీదుగా జరిపే అవకాశం నాకు లేకుండా పోయింది. అనుకోకుండా అదృష్టం తలుపు తట్టినట్లు మధుమూర్తి వచ్చి నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు. అయితే నిన్న నీతో విషయం చెప్పలేదు. అసలే నువ్వు అన్యమనస్కంగా వున్నావని చెప్పటానికి సాహసించ లేక పోయాను. మధుమూర్తికి అయిదేళ్ళ క్రితం వివాహ మయిందట. రెండేళ్ళు తిరిగేలోగానే భార్యా వియోగం కల్గింది. ఒక బాబును కని పురిటిలోనే కన్నుమూసింది ఆ ఇల్లాలు! ఈ విషయం కూడా నీతో చెప్పి నీ అంగీగారం అడగమన్నాడు అతడికి యీ మూడేళ్ళుగా పెళ్లి మీద మనసు పోలేదట! అయితే, ఈ మధ్య నిన్ను చూసేక మళ్ళీ ఆ అభిప్రాయం కల్గిందట! అతనిది మించిపోయిన వయసు కాదు. మనిషి మంచివాడు? రెండో పెళ్లి అని అనుమానించకుండా నువ్వు యీ సంబంధానికి వొప్పు

కుంటే బాగుంటుంది. నీ మనసులో ఇంకెవరయినా వుంటే చెప్పు! నీ అభీష్టానికి వ్యతిరేకంగా నిన్ను బలవంతం చెయ్యను. కాని,ఇంత మంచి సంబంధం వదులుకోవటం మాత్రం అజ్ఞానమే అవుతుంది" ఆవేశంగా మాట్లాడి బరువుగా ఊపిరి పీల్చుకున్నారాయన.

అరుణకు మనసులో మళ్లీ సంఘర్షణ ఆరంభమయింది. మధుమూర్తి రెండో పెళ్లివాడా? ఆదొక కొత్త విషయం!

పెళ్ళి చేసుకున్న అమ్మాయి చనిపోతే, కనీసం మూడేళ్ళయినా తిరగకుండా మళ్లీ పెళ్ళికి సిద్ధ మయిపోతున్నాడా?

మధుమూర్తి గురించి తాను పెంచుకున్న మంచి అభిప్రాయ మంతా కరిగిపోవటం ఆరంభించింది. మనసులోని అక్కసు బయట పెట్టటానికి కూడా మంచి తరుణం లభించింది.

"నాన్నా! నన్ను రెండో పెళ్ళి వాడికిచ్చి బరువు దింపుకుందా మనుకుంటున్నారా? ఇది చాలా అన్యాయం! నా పెళ్లి విషయంలో నా అభిప్రాయానికి కూడా విలువ నివ్వండి!" అంది.

జానకిరామయ్య గారు కొంతసేపు అచేతనులయి పోయేరు. తరువాత కంట్లో తిరిగిన నీళ్ళు వొత్తుకుంటూ "ఎంత మాటన్నా వమ్మా! నీ యిష్టానికి వ్యతిరేకంగా నేనేమీ చెయ్యను. నాకీ ఆలోచన లేదు! మధుమూర్తి తనంతట తాను వచ్చి అడిగితే నువ్వు సుఖ పడతావని సరే నన్నాను. అంతే! నీ బరువు దింపుకోటానికి నే నెవర్ని? మా అందరి బరువూ నువ్వే మోస్తున్నావు. నువ్వే లేకపోతే మేము యేమయి పోయేవాళ్ళమో!" ఆయన కంఠం రుద్ధమయింది.

అరుణ కళ్లు తుడుచుకుంది రుమాలుతో.

తండ్రితో అనునయంగా "క్షమించండి నాన్నా! మిమ్మల్ని బాధ పెట్టేను. నాకు జన్మనిచ్చేక మీ ఋణం తీర్చుకోవాలి కదా! ఇది నాకు బరువెలా అవుతుంది? ఏదో ఆవేశంలో మాట్లాడేను. టైం అవుతోంది! ఆఫీసుకు వెళ్ళాలి!" అంటూ లేచింది. మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ బస్సు స్టాప్ వైపు కదిలిపోయింది.

## 6

రుమాలుతో ముఖం వొత్తుకుంటూ టెలిఫోన్ జంక్షన్ బాక్సు

ముందు కూలబడింది అరుణ! ఆఫీసు కొచ్చిన అయిదు నిమిషాలకే పన్నెండు ఫోనోగ్రాములు ఇన్‌ట్రేలోకి వచ్చేయి. ఖాళీ దొరికినపుడు టెలిగ్రామ్స్ బుక్ చేయటం ఆరంభించింది. ఎర్రలైటు వెలగటం—'కార్డ్' గుచ్చి 'కాల్' తీసుకోటం—లైటు ఆరిపోవటం—క్షణంలో మళ్ళీ మరో మూల వెలగటం—రాంగ్ నంబర్లు—క్షమాపణలు—మందలింపు—విసుక్కోడాలు —కసురుకోవడాలు.... 'తల్లీ! ఏం చేస్తున్నా రమ్మ'లు—అర్జెంటుగా కనెక్ట్ చేయమనటం—అన్నీ మామూలే! ఇరవై నిమిషా లయ్యేసరికి పూర్తిగా పనిలో మునిగి పోయింది.

అంతలోనే శ్రీకాంత్ నుండి ఫోన్ వచ్చింది.

"గుడ్‌మార్నింగ్ అరుణా!"

"గుడ్‌మార్నింగ్! చాలా బిజీగావున్నాను తొందరగా చెప్పు!"

"బిజీగా వున్నప్పుడు నీ గొంతు ఎంత బాగుంటుందో తెలుసా?"

"నాకెలా తెలుస్తుంది! ఎప్పుడూ వినేవాడవు కనుక నువ్వే చెప్పాలి. అయినా, నా గొంతు బావుంటుందని చెప్పటానికి ఇదా సమయం...?" అంటూ నిన్నరాత్రి విషయాలు అన్నీ చెప్పెయ్యా లనుకుంది. కాని అంతలోనే సమయం కాదని వూరుకుంది.

"అరూ! నాకు లీవు శాంక్షను అయింది. ఈ సాయంకాలం ఆరు గంటల రైలుకే మావూరు వెళుతున్నాను. సాయంత్రం స్టేషన్‌కి రా! అరగంట ముందుగా రావాలి! ఓ ముద్దిచ్చి పంపిద్దువుగాని...."

"ఎక్కడ ప్లాట్‌ఫారం మీదా?" నవ్వుతూ అడిగింది.

"ప్లాట్‌ఫారం మీదకాదు, పెదాల మీద" చిలిపిగా వుంది శ్రీకాంత్ గొంతు.

"ఇదిగో, ఇప్పుడే తీసుకో!" అంటూ టెలిఫోన్ మౌత్‌పీస్ మీద ముద్దు పెట్టుకుంది.

"ఇప్పుడెక్కడ ముద్దు పెట్టుకున్నావో చెప్పనా? నా పెదాల మీద కాదు, టెలిఫోన్ పెదాలమీద....అరూ! తప్పకుండా వస్తావు కదూ?"

"ష్యూర్! తప్పకుండా వస్తాను. హైద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ కేనా?...."

"అవును.... వుంటాను మరి!"

"బై!"

అంతలోనే పర్చేజ్ ఆఫీసరునుండి కాల్ వచ్చింది.

"గుడ్‌మార్నింగ్! నంబర్ ప్లీజ్!" అంది.

"మిసెస్ అరుణా...." అటునుండి ఆఫీసరు గొంతు గంభీరంగా పిల్చింది.

"సారీ ఫర్ ది ఇంటరప్షన్!....మిస్ అరుణా సర్!" మిస్ ఒత్తి పలుకుతూ మధ్యలో అడ్డు తగిలింది.

రెండేళ్ళగా పని చేస్తోంది తను ఈ ఆఫీసులో. తను మిసెస్సో మిస్సో ఆయనకు తెలీదా? ఇదో నాటకం అనుకుంది?

"ఐ సీ! మిస్ అరుణా! మీరు లంచ్ అవర్‌లో నా ఆఫీసుకు రండి...." ఇంగ్లీషులో అన్నాడాయన.

"సారీ! టెలిగ్రాములు బోలెడు వున్నాయి. టైపింగ్ జాబ్ కూడా చాలా వుంది. అదంతా లంచ్‌టైములో పూర్తి చేసుకుందామనుకుంటున్నాను. క్షమించి....ఎందుకు పిలుస్తున్నారో చెప్పండి" మార్దవమయిన గొంతుతో అంది, తాను ఆ రూముకు వెళ్ళటం ఎలాగయినా తప్పించుకోవాలనే వుద్దేశ్యంతో.

"మీ ఉద్యోగం వూడిపోకుండా వుండాలంటే లంచ్ సమయంలో నా ఆఫీసుకు రండి. మీరు ఏం చేసేరో చెప్తాను" చాలా కరుకుగా ఇంగ్లీషులో మాట్లాడి ఫోను గట్టి శబ్దంతో పడేశాడాయన.

అరుణకు చెవులు చిల్లులు పడినట్టయింది.

'ఎంత వయసొస్తేనేం? ఎంత వున్నతమయిన వుద్యోగంలో వుంటేనేం? బొత్తిగా మేనర్సు లేవు. ఛీ!' అనుకుంది.

తెల్లారి లేస్తే వందసార్లు ఫోనులో మాట్లాడుతారు. అయినా అంతే! 'హల్లో, హల్లో' అని పదిసార్లు గింజుకుంటేగాని నోట మాట పెగలదు. ఎవరు ఫోన్ చేస్తున్నారో చెప్పరు.

అవతలివాళ్ళు ఎవరో చెప్పకపోతే మాత్రం కోపం వచ్చే

స్తుంది. 'హు ఈజ్ స్పీకింగ్ ప్లీజ్!' అనే ముందు 'సో అండ్ సో స్పీకింగ్' అని చెప్పాలనే ప్రాథమిక మర్యాద కూడా తెలీదు. ఇవన్నీ ఇలా వుండగా కోపాలు, తాపాలు అన్నీ ఫోన్ రిసీవర్ల మీద చూపిస్తారు. ఇంకా కోపం ఎక్కువయితే కార్డ్ తెంపేస్తారు. కనెక్షన్లు పీకేస్తారు. కొంతమంది పెరట్లోవున్న పెళ్ళాన్ని పిలుస్తున్నట్లు అరుస్తూ మాట్లాడుతారు, చెవులు చిల్లులు పడేలాగ. 'ఇయర్ ఫోన్'లోని 'డయాఫ్రం' గరగరమంటూ ఊగిపోతూ వుంటే, చెవుల్లో కరిగించిన సీసం పోస్తున్నట్లు వుంటుంది.

అంత గట్టిగా అరిచి మాట్లాడేదానికి టెలిఫోన్లు ఎందుకు?

ఆటవిక జనం అరుచుకున్నట్లు ఒక గదిలోంచి మరో గదిలోకి వినబడేలా అరిస్తే సరిపోతుంది కదా?!

మళ్ళీ కొత్తముసలం వచ్చి పడింది.

పర్చేజ్ ఆఫీసరు వ్యవహారం దూకుడుగానే వుంది. ఆయనకు కోపం, చికాకు రెండూ ఎక్కువే! ఎప్పుడూ ధుమధుమలాడుతూనే వుంటాడాయన.

నిజానికి ఆయన తన బాస్ కాదు. ఆఫీసు మేనేజరు క్రింద తాను వుద్యోగం చేస్తోంది. తనను తిట్టాలన్నా, కనీసం తనకు 'వార్నింగ్' ఇవ్వాలన్నా తన మేనేజరు ద్వారానే రావాలి. కాని, ఈ నియమాలు ఎవ్వరూ పాటించరు. ఎవళ్ళ కోపాలు వాళ్ళు, పదవుల్లో వున్నందుకు చూపించక మానరు! మనిషి కనుపించకపోయినా అందరికీ అందుబాటులో వుండేవి తన చెవులే!

లంచ్ సమయంలో ఇంటి దగ్గరనుండి తెచ్చుకున్న టిఫిన్ ఆదరాబాదరాగా నోటిలో కుక్కుకొని పర్చేజ్ ఆఫీసరు రూముకు వెళ్ళింది.

స్ప్రింగ్‌డోర్ తెరిచిపట్టుకుని "మే ఐ కమిన్ సర్!...." అంది.

"కమిన్" కసురుతున్నట్లే అన్నాడాయన.

భయంగా అడుగులు వేసుకుంటూ లోనికి వెళ్ళింది. నల్లగా భారీగా వున్న విగ్రహం ఆయనది! నెత్తిమీద బట్టతల ఏర్పడగా

యింకా కలుపు మొక్కల్లా పదిహేనో యిరవయ్యో తెల్లవెంట్రుకలు మిగిలివున్నాయి. దళసరి అద్దాల కళ్ళజోడు! పొట్ట అంతా బయటకు కనబడేలా క్రిందకు దించి చేసిన పుల్‌షర్టు టక్! బరువుగా కుర్చీలో యిటూ అటూ కదుల్తూవుంటే రివాల్వింగ్ కుర్చీ కీచుమంటూ మూలుగుతోంది. లోనికివెళ్ళి రెండునిమిషాలు నిలబడిపోయింది అరుణ! కనీసం మర్యాదకయినా కూర్చోమని అనలేదు ఆయన.

ఏదో బెడిసికొట్టే వ్యవహారంలాగే కనుపించింది అరుణకు!

రోటిలో తలదూర్చేక రోకటిపోటుకు భయపడట మెందుకని లేని ధైర్యం నటిస్తూ నిలబడింది.

"నిన్న మీరేం చేశారో తెలుసా?"

తెలియదన్నట్లు తల అడ్డంగా వూపింది.

"కొంపలంటించేరు!"

'ఎవరివి?' అని అడగాలనిపించింది. కాని మౌనంగానే వుండిపోయింది.

"ఎవరికొంపలని అడగరేం?" కసిరేడాయన.

ఆయనమాట తీరుకు నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు అరుణకు.

"ఇంకెవరివో అయితే మీకెందుకు కోపం వస్తుందిసార్?" 'ఆమాత్రం తెలుసుకోలేని మూర్ఖురాలిని కాను' అన్నట్లు మాట్లాడింది.

"అహా! అయితే అర్థమయిందన్నమాట! నిన్న మధ్యాహ్నం మూడున్నరకు, మా యింటికి 807 నెంబరుకి కనెక్టు చేయమన్నాను. మీరు 808 నెంబరుకు కనెక్షను యిచ్చేరు. అదెవరిల్లో తెలుసా? ఇంజనీరు బాలాజీరావుగారిల్లు. వాళ్ళావిడ ఫోను ఎత్తుకుంది...."

అరుణకు విషయం అర్థమయింది. ఏదో పెద్ద గొడవే జరిగుండాలి! అందుకే యీయన అగ్గిరాముడయిపోయాడనుకుంది.

మతిపోయినదానికి మల్లే ఆయన చెప్తున్నది వింటూ నిలబడి పోయింది.

"....నేను ఆఫీసుకు వచ్చేముందు ఫస్టుషో సినీమాకు వెళ్దాం, రెడీగా వుండమని మా ఆవిడకు చెప్పేను. టిక్కెట్లు కూడా

అడ్వాన్సు బుకింగ్‌లో తీయించమన్నాను. అయితే నిన్న నాకు బిజీగా వుండటంవలన 'ఆరుగంటలకు నువ్వు థియేటరుకురా! నేను నేరుగా ఆఫీసునుండి వచ్చేస్తాను' అని చెప్పటానికి ఫోన్‌చేశాను. అది కాస్తా మీరు బాలాజీరావుగారింటికి కనెక్టుచేశారు. మన లైన్సులో మాటలు వినబడటమే కష్టం! గొంతుకలు కూడా ఎలా గుర్తుపట్ట గలం? నేను థియేటరుకు వెళ్ళేసరికి బాలాజీరావుగారి భార్య అక్కడ వున్నారు. వాళ్ళాయన అనుకోకుండా థియేటరు దగ్గరకు రమ్మన్నా రని ఫోన్‌చేసి చెప్పారన్నారు. అంతలోనే మా ఆవిడ చక్కా వచ్చింది. నేను కనీసం ఫోన్ అయినా చేయకుండా అలా థియేటరు దగ్గరకు వచ్చేసినందుకు రుసరుసలాడింది. తాను చాలాసార్లు లైన్ కోసం ప్రయత్నించిందట. కాని నేను దొరకలేదట! 'టిక్కెట్లు ఎలాగూ తీసేంకదా!' అని మా ఆవిడ వచ్చేసింది. ఎంతసేపటికీ బాలాజీరావుగారి రాకమాత్రం కన్పించలేదు. అప్పటికి నాకు సంగతి అర్థమయింది. మిసెస్ బాలాజీరావుగార్కి జరిగిన పొరపాటు వివరించి క్షమాపణ చెప్పి యింటికి పంపేశాం. మా ఆవిడ రాత్రి నామీద మండిపడుతూనే వుంది" అంటూ చెప్పటం ఆపేరాయన.

అరుణకు ఒక్కసారి నిస్పృహ ఆవరించింది.

ఎద్దూ ఎద్దూ పోట్లాడుకుంటే మధ్యన లేగదూడ నలిగి పోయిందట! ఇది పెద్ద గొడవయితే రెండువైపులనుండీ తనమీద విరుచుకుపడతారు. డయల్ చేసేటపుడు పొరపాటున 807 బదులు 808 చేయటం జరిగిందేమో! కాని తనవేళ్ళు అలవాటుపడినవే! సాధారణంగా అలా జరగటానికి వీల్లేదు! అయితే, లైన్సు బాగు లేనపుడు రాంగ్ నంబర్లు కనెక్టు కావటం మాత్రం సర్వసాధారణం! నెంబరులో ఒక 'డిజిట్' మారి మరో 'డిజిట్' మీద కనెక్షన్ వచ్చేస్తూ వుంటుంది. ఇవన్నీ యాంత్రికలోపాలు! మన పనుల కోసం, అవసరంకోసం టెలిఫోన్లు ఉపయోగించుకుంటున్నాం. రెండు వైర్లతో ముడిపడిన యంత్రాలవి!! మనం ఏంచెప్తే అవి ఆ విషయాన్ని అవతలి చివర మనుషులకు చేరవేస్తాయి. అయితే, ఎవరు మాటాడితే ఎవరు వింటున్నారో ఎవరితో మనం మాట్లాడు

తున్నామో తెలుసుకుని జాగ్రత్త పడవలసిన అవుసరం మనకులేదా?

నిజానికి, రిసీవరు ఎత్తి ఎవరు మాట్లాడుతున్నారో చెప్పి అవతలి గొంతు ఎవరిదో అడిగివుంటే యీ పొరపాటు జరగదు!

అంతేకాని, ఫోను ఎత్తి మన నెంబరే అన్న ధీమాకొద్దీ అవతలి చివర భార్యే వుందనుకొని వ్యవహారాలు నడిపిస్తే ఎలా? ఆ తప్పు తనదా!?

అందుకు తన ఉద్యోగం ఊడిపోతుందా?

అరుణకు ఏడుపు వచ్చినంత పనయింది.

'సార్! మీరు ఎవరితో మాట్లాడు తున్నారో ముందుగా కనుక్కో లేదా?' అని అడగా లనిపించింది.

కాని, తను అడగలేదు. అడిగితే మండి పడతాడాయన!

గొడవ ముదిరిపోతుంది. ఆయన ఆఫీసు మేనేజరుకు 'కంప్లయింటు' ఇవ్వటం, తననుండి 'ఎక్స్‌ప్లనేషను కాల్ ఫర్ చేయటం,' ఇంక్వయిరీలు బోలెడంత తతంగం!

రూలు ప్రకారం తన తప్పు లేదని చూపించ గల్గినా మనసులో కార్పణ్యాలు ముదిరిపోతాయి. అక్కడనుండి ఎందులోనో తనను యిరికించి ఉద్యోగానికి ఎసరు పెట్టాలని చూడటం—తనకు మనస్థాపం మాత్రం మిగులుతుంది. రాజీ తప్ప మార్గంలేదు.

"క్షమించండి సార్! ఇలా జరిగి నందుకు చాలా బాధగా వుంది!"

"క్షమించమని ఒక్కముక్క నాతో అనేస్తే తీరిపోతుందా?"

"మరేం చేయమంటారు?" అసహనంగా అడిగింది.

"సాయంత్రం మా ఇంటికివచ్చి మా ఆవిడతో ఈ విషయం చెప్పాలి! అసలే మా ఆవిడ అనుమానం మనిషి! నిన్నటినుండి మా ఇద్దరి మధ్యా అగ్ని రగుల్కొంటూనే వుంది. ఆఫీసయిన వెంటనే మా యింటికివచ్చి చెప్పి వెళ్ళండి." దళసరి కళ్ళద్దాల్లోంచి కనులు పైకెత్తి చూస్తూ మాట్లాడేరాయన.

అరుణకు ఏడుపు రావటమే తరవాయిగా వుంది.

"అలాగే నండీ" అంటూ మెల్లగాచెప్పి బయటకు కదిలింది.

"నా క్వార్టరు నెంబరు తెలుసు కదా!" వెనుకనుండి అరిచే డాయన.

"రాంగ్ నంబరు డయిల్ చేయటం జరుగుతుందేమో కానీ, రాంగ్ క్వార్టర్‌కి పొరపాటున కూడా వెళ్ళను సార్! మీ ఇంటి నెంబరు నాకు తెలుసు...." అంటూ వడిగా అడుగు లేసుకుంటూ సీటులోకి వచ్చేసింది.

ఫేను ఆన్‌చేసి పైపు చేసిన కాగితాలు ఎగిరిపోకుండా ట్రే ఎత్తు పెట్టి కుర్చీలో కూలబడింది. ఆయనకు యెంతలేదన్నా నలభై అయిదేళ్లు పైబడి వుంటాయి. అంటే భార్యకు నలభై ఏళ్ళన్నా వుండాలి. ఇద్దరి వివాహ జీవితమూ ఆరంభమయి కనీసం ఇరవై సంవత్సరాలయి వుంటుంది. అయినా, ఆవిడకు యింకా అనుమానం. ఈయనగారికి సర్ది చెప్పుకోలేని భయం! ఆఫీసుల్లో పులుల్లా ప్రవర్తించే ఈ మనుషులందరూ పెళ్ళాల దగ్గర పిల్లులే కాబోలు! పరిస్థితిని అర్థం చేసుకుని విజ్ఞతతో వ్యవహరించే తీరయినా భార్యలకు నేర్పరు!

ఇలా రాంగ్ నంబరు కనెక్షన్లన్నిటికీ తనే బాధ్యత తీసుకుని వాళ్ళ వాళ్ళ భార్యల వద్దకు వెళ్లి 'కన్విన్స్'చేసి చెప్పాలంటే ఆఫీసులో రెండుగంటలయినా పని అవదు.

అయినా తప్పనిసరే! వెళ్లాలి!

ముందుగా వెళ్ళి ఆవిడతో సర్దిచెప్పి స్టేషన్‌కు పరుగెత్తాలి.

హేండ్‌బాగ్‌లో డబ్బులు చూసుకొంది. మూడు రూపాయల చిల్లర మాత్రం వుంది. ఆటోరిక్షాలో వెళ్ళటం కుదరదు. బస్సుల్నే నమ్ముకోవాలి.

దీర్ఘంగా నిట్టూర్చింది అరుణ.

నాలుగింటివరకూ బరువుగా నడిచింది కాలం!

ఆఫీసవుతూనే బయటకు వచ్చింది. ఇందిర బయట లాన్‌లో కూర్చొని పత్రిక తిరగేస్తోంది.

"తల్లీ, సీటు కదలి వచ్చేవా? ఇంటి కెళ్దామా?" అంది అరుణను చూసి.

"లేదు ఇందిరా, నేను పర్చేజ్ ఆఫీసరు యింటికెళ్ళాలి!"

అనుమానంగా అరుణ కళ్ళల్లోకి చూపింది యిందిర. తరువాత "ఆ ముసలాయనతో నీకేంపని? అంతకంటె ఎవరు దొరకలేదా?" అంది.

"చాల్లే నీ పరిహాసాలు! నోటిమీద వాతపెట్టేస్తాను! నిన్న ఒక గొడవొచ్చి పడింది...." అంటూ జరిగిన సంగతి వివరించింది.

ఇందిర అంతావిని పక పక నవ్వేసింది.

"అరుణా! నువ్వోసారి నా సెక్షనుకురా!" గంభీరంగా అంది.

"ఎందుకు?"

"నే నీవేళ నా ప్రియునికి ఫోన్ చేశాను. అది పూర్ణా మార్కెట్లో బెల్లం కొట్టుకు వెళ్ళింది. నువ్వు నా ప్రియుడి రూముకు వెళ్లి క్షమాపణ చెప్పుకోవాలి. వస్తావా, సరి! లేదా, ఉద్యోగం ఊడిపోతుంది!....ఆ! మరిచిపోయాను! బెల్లంకొట్టు ఆసామీని డిస్టర్బ్ చేసి వేడెక్కించినందుకు నువ్వెళ్లి ఆయనకు కూడా క్షమాపణ చెప్పాలి! ఆయన ఎడ్రసు ఇస్తాను" అంటూ పడీ పడీ నవ్వసాగింది ఇందిర.

"నా ఉద్యోగం అలా అయిపోయింది! పద బస్సుస్టాపుకు వెళ్దాం!" అంది. ఇద్దరూ నడక ఆరంభించేరు.

"అరుణా! రాంగ్ కనెక్షను వస్తే ఆయనగారు ఒంటిమీద తెలివిలేకుండా మాట్లాడటమేమిటి? అందుకు నువ్వెళ్లి క్షమాపణలు చెప్పడమేమిటి? నేను రానని చెప్పాల్సింది. 'మెమో' వస్తే అప్పుడే వ్యవహారం తేల్చుకుని ఉండేవాళ్లం! నువ్విలా అలుసిస్తే మరీ నెత్తికెక్కి కూర్చుంటారు" సీరియస్‌గా అంది.

"నీకేం, ఏమైనా చెప్తావు! ఈ ఉద్యోగం పోతే నాకు వేరే ఆధారం యేమీలేదు. నామీద ప్రస్తుతం నేనుకాక నాలుగు జీవాలు ఆధారపడి బ్రతుకుతున్నాయి. నీకుమల్లే సరదాకు, పాకెట్‌మనీకి ఉద్యోగం చేస్తూవుంటే ఇంతకంటె దర్జాగా సమాధానం చెప్పివుండేదాన్ని. పేదవాళ్ల కోపం పెదవికి చేటుట! యిప్పుడు తగవు పెట్టుకుంటే నా పని అయినట్లే! మూడు ఛార్జి షీట్లిచ్చి తరువాత 'నిన్నెం

దుకు ఉద్యోగంలోంచి పీకెయ్యకూడదో చెప్పు!' అంటారు. అప్పుడు చేయగలిగింది ఏముంది?" నిష్ఠూరంగా అంది అరుణ.

"అరుణా! మనం వుద్యోగాలు బ్రతుకుతెరువుకోసం చేస్తున్నామా? లేక విలాసాలకోసం చేస్తున్నామా? అనేది యిక్కడ అప్రస్తుతం! నువ్వు నీ డ్యూటీ చేస్తున్నావు. నీ శక్తిమేరకు కంపెనీ కోసం పాటుపడుతున్నావు. అందుకు నీకు కంపెనీ ప్రతిఫలం ముట్టజెప్తోంది. నీమీద సానుభూతితోకాని, ప్రేమతోకాని జీతం ఇవ్వటం జరగటంలేదు. అలాగే నువ్వు మీ ఆఫీసు మేనేజరుమీద యిష్టంతో కేవలం పని చేయటంలేదు! ఆ సీట్లో ఈవేళ విశ్వనాధంగారు! రేపు మరో రామనాధంగారు వస్తారు? అయినా నీ పని నీదే! అది చేయటం తప్పదు. నీ విధి నువ్వు సక్రమంగా నిర్వర్తిస్తున్నంతసేపూ ఎవ్వరికీ భయపడనక్కరలేదు. ప్రతి చిన్న విషయానికీ భయపడుతూ యిలా యెంతకాలం ఉద్యోగం చెయ్యగలవు? తుమ్మితే ఊడిపోతుందనుకుంటే యెలా? ఆఫీసర్లుకూడా అందరూ మనకి ద్రోహంచేసే తలంపుతో వుండరు! వాళ్ల ఉద్యోగ నిర్వహణలో మనమీద 'యాక్షన్' తీసుకోటం తప్పనిసరి అనే పరిస్థితి యేర్పడితే వాళ్లు మాత్రం ఎలా తప్పించుకోగలరు? నీ డ్యూటీ నీకు యెంతో, వాళ్ల డ్యూటీ వాళ్లకూ అంతే! ఈ రెండు వర్గాలమధ్య పోరాటాలు అభిప్రాయ భేదాలూ తప్పవు. అంత మాత్రంచేత ప్రతి చిన్న విషయానికీ మనం దాసోహమనటం తప్పు! అది నిజానికి అవుసరంలేదు. నువ్వు ఇలా తలివంచటం నాకు నచ్చలేదు" ఉపన్యాస ధోరణిలో ఆవేశంగా చెప్పింది ఇందిర.

అరుణ మౌనంగా వింటూ నడుస్తోంది.

మామూలుగా నిత్యం చూసే ఇందిర కాక ఏదో క్రొత్తమనిషిని చూస్తున్నట్లుంది. చలాకీగా హుషారుగా పరుగెత్తే సెలయేటిలా వుండే ఈ పిల్ల మనసులో యెన్ని విషయాలున్నాయి!

కోలగా తెల్లగా వుండే ఈ ముఖంలో యెంత పట్టుదల!

తేటగా స్వచ్ఛంగా వుండే ఆ వెడల్పయిన కనుల వెనుక

యెంత నిబ్బరం!

ఈ పట్టుదల, నిబ్బరం ఈ మనిషికి యెలా వచ్చేయి?

ఖచ్చితమయిన నిర్ణయం తీసుకునే శక్తి సన్నగా పీలగా వుండే యీ పిల్లకి యెలా పట్టుబడింది?

ఇందిరతో తనకున్న స్నేహం బాగానే బలపడింది.

ఇందిర తనకు ఎంత చేరువవుతున్నా తను మాత్రం మన పిచ్చి దగ్గరకు వెళ్లలేకపోతోంది. తనకు తెలిసినంతవరకూ ఇందిరలో చెడ్డగుణాలు ఏమీలేవు. ఆమెతో కలిసి మాట్లాడే సమయమంతా తెలియకుండానే గడిచిపోతుంది. అయినా ఆమెకు తాను దగ్గరకాలేక పోతోంది!

ఒకే వీధిలో వుంటున్నా తెగించి ఆ యింటిలో అడుగు పెట్ట లేకపోతోంది!

ఎన్నోసార్లు తనను ఆహ్వానించింది ఆమె!

కాని, తనే వెళ్లలేదు.

కారణం యేమిటి? మనస్సును మళ్ళీ మళ్ళీ ప్రశ్నించింది.

ఒక్కటే కారణం! ఇందిర కలవారి పిల్ల!

తను మధ్య తరగతి కుటుంబానికి ఓ మెట్టు క్రిందనే వుంది!

ఇద్దరికీ మధ్య ఒక పెద్ద అగాధం వుంది. అది డబ్బుతోకాని పూడుకోదు.

ఇందిర స్థాయిలో తాను ఖర్చుపెట్టలేదు! చీరలు కట్టలేదు, నగలు పెట్టుకోలేదు, విలాసాలు చేయలేదు! కనీసం ముఖ్యావసరా లయినా తీర్చుకోలేదు. ఆమె కాఫీకి పిలిస్తే యేదో కారణం చెప్పి తప్పించుకోవాలనిపిస్తుంది. నాలుగుసార్లు ఆమె బిల్లు చెల్లిస్తే అయిదో సారి అయినా తాను యివ్వక తప్పదు. అది తన బడ్జెట్‌కు మించిన ఖర్చే అవుతుంది. అందుకే, అర్థంలేని కారణాలు చెప్పి తప్పించు కోటం!

"ఏం, మాట్లాడవేం? ఈ పిచ్చిది యేదో వాగుతోంది, వినే దేమిట్లే అని ఆలోచనలోపడ్డావా?" అంది ఇందిర.

"అబ్బే, లేదు! నువ్వు చెప్పింది నిజమే. కాని అందుకు

తగిన స్థయిర్యం మనసుకు వుండాలికదా! నీ స్థానం వేరు, నా స్థానం వేరు" అంది. ఎంత అనకూడదనుకున్నా ఆఖరుమాట బయటకు వచ్చేసింది.

ఇందిర అదోలా చూసింది అరుణ వంక.

ఆ మాట అన్నందుకు బిడియపడింది అరుణ.

"నీకు 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు' బాగా వుంది. అది తగ్గించుకోపోతే బాగుపడవు. తరువాత నీ యిష్టం! నేను నీకంటె వయసులో పెద్దదాన్ని కాకపోవచ్చు. కాని, నీకంటె ఎక్కువ పుస్తకాలు చదివేను. జీవితాన్ని గానుగెద్దులా గడపడం లేదు కనుక ప్రపంచాన్ని కూడా నీకంటే ఎక్కువే తరిచి చూశాను. జీవితంలో మనం అనుకున్నది సాధించాలన్నా, సుఖపడాలన్నా కావల్సింది ధైర్యం! సరియైన నిర్ణయం తీసుకుని ఆచరణలో పెట్టగలిగిన స్థయిర్యం! ఇవి రెండూ డబ్బుకంటె అవుసరం. సుఖపడడమంటే నా దృష్టిలో భోగభాగ్యాలు అనుభవించటం కాదు! తృప్తిని సాధించి మనసును హాయిగా వుంచుకోవటమనే సందర్భంలో సుఖపడటమనే మాట వాడేను" ఇందిర గంభీరంగా అంది.

అరుణకు మతి పోతున్నట్లుంది.

తన కళ్ళకెదురుగా వున్న ఇందిర క్షణ క్షణానికీ ఎంతో ఎత్తుకు ఎదిగిపోతున్నట్లనిపించింది. తాను నేలమీద కుంచించుకుపోతున్నట్టుగా వుంది.

"క్షమించు ఇందిరా!" అంది ఏమనాలో తోచక.

"ఇందులో క్షమాపణలకేముంది? నీమీది చనువుకొద్దీ మాట్లాడేను. నువ్వు కూడా బాధ పడకూడదు, మరి!"

మాటల్లో బస్సుస్టాపు చేరుకున్నట్లే తెలియలేదు వాళ్ళకి.

"అరుణా! ఈ సాయంకాలం మా యింటికిరా! నీకో శుభవార్త చెప్తాను."

"పర్చేజ్ ఆఫీసర్ ఇంటికి వెళుతున్నాను కదా! అక్కడనుండి స్టేషన్‌కు వెళ్ళాలి. ఆరున్నర దాటిపోతుందేమో నేను వచ్చేసరికి. అయినా, ఏమిటో ఆ శుభవార్త?"

"చెప్తాను కదా! ఆలస్యమయినా ఫర్వాలేదు, తప్పక రావాలి. నీకోసం ఎదురు చూస్తూ వుంటాను" అంది.

అంతలోనే సిటీబస్సు వచ్చింది. ఇందిర బస్సు ఎక్కేసింది. చెయ్యి వూపుతూ "వస్తానులే." అంటూ క్వార్టర్స్ వైపు నడక సాగించింది అరుణ.

మెయిన్ రోడ్ వదలి క్వార్టర్సు వైపు వెళుతూవుంటే కాళ్ళలో వణుకు ఆరంభమయింది. ఆవిడతో ఎలా చెప్పటం? ఏం ప్రశ్నలు వేస్తుందో! అసలు, ఇలా వెళ్ళటమే చాలా చిన్నతనంగా వుంది అరుణకు. సాధ్యమయినంత తక్కువ మాట్లాడి తిరిగి వచ్చెయ్యాలని నిర్ణయించుకుంది.

పూలమొక్కల మధ్యనుండి క్వార్టర్సు గుమ్మం దగ్గరకు సన్నని దారి వుంది. రెండువంకలా విరబూసిన గడ్డి గులాబీ పొదలున్నాయి. సాయంకాలమవుతూవుంటే అలసి సొలసిపోయి సోలిపోతున్నట్లు ముడుచుకుపోతున్నాయి అవి!

కాలింగ్‌బెల్ నొక్కగానే ఒకావిడ వచ్చి తలుపు తీసింది. ఆమెను చూడగానే ఇంటావిడే అయివుంటుందనుకుంది. "నమస్కారం! నేను ఆఫీసులో టెలిఫోను ఆపరేటరుగా పనిచేస్తున్నాను. నా పేరు అరుణ!" అంది వినయంగా.

"లోపలకురా!" అంటూ సాదరంగా లోనికి తీసుకెళ్ళిందామె.

తాను వూహించుకున్న దృశ్యానికీ జరుగుతున్నదానికీ ఏమీ సంబంధం కనుపించటం లేదు. ఆవిడకు సుమారు నలభై యేళ్ళ వయసుంటుంది. దబ్బపండులా వుందామె. కంచిపట్టుచీర కట్టింది. నుదుటన పెద్ద కుంకుమబొట్టు! కళకళ్లాడే ముఖం!

"అలా కూర్చో!" అంటూ సోఫా చూపించి "మంచినీళ్ళు కావాలా?" అంది ఆప్యాయంగా.

"ఇప్పుడేమీ వద్దండీ! నేను తొందరగా వెళ్ళిపోవాలి. నిన్న మధ్యాహ్నం ఆఫీసులో పొరపాటు జరిగింది. మీవారు ఈ ఇంటికి కనెక్షను ఇమ్మని అడిగేరు....అది కాస్తా బాలాజీరావుగారింటికి వెళ్ళిపోయింది. అనవసరమయిన గొడవలకు కారణమయ్యాను. రాంగ్

నంబర్లు వస్తూవుండడం అప్పుడప్పుడు జరుగుతూ వుంటుంది. ఏది ఏమైనా, నిన్న మీకు జరిగిన అసౌకర్యానికి బాధపడుతున్నాను!" పాఠం వల్లించినట్లు గడగడ మాట్లాడి నాటకంలో తన సంభాషణ ముగిసేక నటన తెలియక నిలబడిపోయిన ముసలి పాత్రకుమల్లే చూస్తూ వుండిపోయింది.

"ఇందులో నీ తప్పేముంది? ఇలాటి పొరపాట్లు నిత్యం జరుగుతూనే వుంటాయి. నువ్వు బాధపడాల్సింది ఏమీలేదు. ఆ ముక్క చెప్పటం కోసం శ్రమ తీసుకుని ఇంత దూరం వచ్చేవా? కూర్చో, కాఫీ తెస్తాను" అంటూ అరుణ వారిస్తున్నా వినకుండా వంట గదిలోకి వెళ్ళిపోయిందావిడ.

అరుణకు అంతా అయోమయంగా వుంది. అసలు అనుమానం మనిషిలా కనబడటం లేదు ఈవిడ. అంతలోనే కాఫీ కప్పులతో తిరిగి వచ్చింది. ఒకటి అరుణకు అందించి రెండోది తను తీసుకుంది.

కాఫీ త్రాగడం ముగించి "మీ ఇద్దరి మధ్యా కలతలు రేపటం ఇష్టంలేక చెప్తే బాగుంటుందని వచ్చాను. ఆయన ఈ సాయంకాలం నన్ను స్వయంగా వచ్చి మీతో చెప్పమని ఈ మధ్యాహ్నం చెప్పేరు" అంది అరుణ.

"నేను అనుకున్నానులే!" అందామె నిర్లిప్తంగా.

"ఆయన ఇంట్లో లేరా?"

"లేరు. నేనే పని కల్పించి బయటకు పంపించాను."

అరుణ అనుమానంగా చూసి "పని కల్పించారా?" అంది.

"అవును! నేనే ఈ మధ్యాహ్నం రెండు గంటలకు ఎక్స్ప్రెస్‌లో కాకినాడ వెళ్దామనుకున్నాను మా అన్నగారిని చూసి రావటానికి! కాని, అంతలోనే మా అన్నగారే ఇక్కడకు వస్తున్నట్లు కబురొచ్చింది. అందుకని ఆగిపోయాను. ఉదయం పరిస్థితినిబట్టి సాయంకాలానికి నేను వూళ్ళో వుండను. మాకు పిల్లలు కూడా లేరు కదా! అందుకని ఆయన ఒక్కరే ఇంట్లో వుంటారు. నువ్వొస్తావు! అదీ సంగతి!" అంది.

అరుణకు రెండు నిమిషాలసేపు నోట మాట రాలేదు.

పర్చేజ్ ఆఫీసర్ రూపం మనసులో మెదిలి గుండెల్లో దడ ఆరంభమయింది.

"ఆయన రమ్మంటే నా ఉద్యోగానికి ముప్పు వస్తుందనే భయంతో వచ్చాను. అంతే! నా తప్పేం లేదు" అంది పొడారిన కంఠంతో.

"నాకు తెలుసమ్మా! నా బంగారం మంచిది కానప్పుడు ఎదుటివాళ్ళను యెలా తప్పు పడతాను? నా జీవితంలో అన్నీ రాంగ్ నెంబర్లే తగులుతున్నాయి. బాలాజీరావుగారి భార్య అందులో ఒకటి మాత్రమే!" అంటూ దీర్ఘంగా నిట్టూర్చి "ఇది రాంగ్ క్వార్టరుతల్లీ! ఎప్పుడూ ఇక్కడికి మాత్రం రాకు....ఇప్పుడే వస్తానుండు...." అంటూ లోనికి వెళ్ళి రవికెల గుడ్డ తెచ్చి అరుణ ముఖానికి బొట్టు పెట్టి ఆ గుడ్డ చేతిలో వుంచింది. అరుణ స్తబ్ధుగా నిలబడిపోయింది.

జరుగుతున్న విషయమంతా కలలో దృశ్యానికిమల్లే అనిపిస్తోంది.

ఆవిడ మంచితనానికి సమాధానం ఎలా చెప్పాలో తోచక కంఠం రుద్ధమయిపోయింది అరుణకు.

రెండు చేతులు జోడించి ఆమెకు నమస్కరిస్తూ, "ఇవన్నీ ఎందుకండీ?" అంది.

"ఫర్వాలేదు! నా కూతురులాటిదానివి. తీసుకు వెళ్లు! ఈ విషయాన్ని బయట ఎక్కడా అనకు. మా విషయాలు రోడ్డెక్కడం నాకు ఇష్టంలేదు. నువ్వు చూస్తుంటే చాలా అమాయకురాల్లా అనిపిస్తున్నావు. నీ జీవితం పాడవుతుందనే భయంతో ఇవన్నీ చెప్పేను. అంతే!" అంది.

"వెళ్ళొస్తానండీ!" అంది అరుణ.

"మంచిది, ఈ విషయం ఏమీ జరగనట్లే వుండాలి" అంది ఆవిడ.

"అలాగేనండీ!" అంటూ బయటకు వచ్చేసింది.

శ్రీకాంత్ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ బయలుదేరటానికి ఇంకా

సుమారు ముప్పయి అయిదు నిమిషాల వ్యవధి మాత్రమే వుంది. జరుగుతున్న సంఘటనలు సమయాన్నీ, ఆలోచనల్నీ కూడా మరిచి పోయేలా చేస్తున్నాయి,

నిన్నటి రిక్షా గొడవ! ఈవేళ మళ్ళీ ఇది!

తన అదృష్టం తనను కాపాడుతోంది.

యాభై యేళ్ళ ముసలాయనకి ఈ ప్రవర్తన ఏమిటి? పెళ్లాం ఊరికి వెళ్తోందని తెలిసి తనను సాయంకాలం క్వార్టర్సుకు రమ్మన టానికి అతనికెంత ధైర్యం? ఛీ! వయసు రాగానే సరా? ఆవిడ మంచి మనిషి కనుక సరిపోయింది. లేకపోతే తనను అల్లరిపెట్టి బ్రతుకు రోడ్డున కీడ్చేవారే!

ఈ ఆలోచన వచ్చేసరికి గుండె భయంతో దడదడలాడింది. నీరసంగా అడుగులు వేసుకుంటూ బస్‌స్టాప్‌కు చేరుకుంది. బస్సు షెల్టరులో స్థంభానికి ఆనుకొని నిలబడింది. పదినిమిషాలవరకూ ఆత్రంగా రావల్సిన బస్సు కోసం ఎదురు చూస్తూ వుండిపోయింది అరుణ.

వచ్చిన బస్సు, తను చేరుకోవాల్సిన సమయంకంటె పది నిముషాలు ఆలస్యంగా స్టేషను దగ్గర దింపింది. స్టేషను కారిడార్‌లో అడుగు పెట్టేసరికి మొదటి నెంబరు ప్లాట్‌ఫారం మీద రైలు కదలి వెళ్ళిపోతోంది. బోగీలమీద హైదరాబాద్ అంటూ పసుపు పచ్చని బోర్డులు వరుసగా కళ్ళ ముందు కదిలిపొయ్యాయి. కొద్దిక్షణాల్లో ఖాళీ ప్లాట్‌ఫారం కళ్ళముందు మిగిలింది తన మనసులాగే. శ్రీకాంత్ తన కోసం రైలు కదిలే చివరి క్షణం వరకూ నిరీక్షించి వుంటాడు. ఏమనుకున్నాడో!!

మనసు విలవిల్లాడిపోయింది.

ఎన్నాళ్లు సెలవు పెట్టాడో వివరంగా తెలీదు. మళ్ళీ ఎప్పుడు వస్తాడో!

"ఏలూరు ఉత్తరం రాసేస్తేనో!" అనిపించింది.

కాని, అంతలోనే అది తెలివయిన పనిలా అనిపించలేదు.

మెల్లగా స్టేషన్ బయటకు వచ్చింది. బస్సు కోసం నిరీక్షించే

ఓపిక లేదు. నీరసంగా అడుగులు వేసుకుంటూ బయలుదేరింది.

ఇంకా ఇందిర వద్దకు వెళ్ళాలి. శుభవార్త చెప్తానని పిలిచినపుడు వెళ్ళకపోతే నొచ్చుకుంటుంది! అనుకుంది.

ముందుగా ఇంటికి వెళ్ళి కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కుని కొంతసేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళాలని నిశ్చయించుకొని ఇంటి వైపు నడక సాగించింది.

## 7

"ప్లీజ్! కమిన్" గేటు తీసుకుని వెళుతుంటే ఇంటి వరండా మెట్లు దిగి ఎదురుగా వచ్చి ఆహ్వానించింది ఇందిర.

వయ్యారంగా కదిలి వస్తున్న రాజహంసలా కనుపించింది అరుణ కంటికి ఆమె. తెల్లని పాలనురుగులాటి జార్జెట్ చీర కట్టుకుంది. మెడలో కెంపుల నెక్లెస్! చెవులకు ఎర్రని రాళ్ళతో జూకాలు నుదుటన సిందూరం రంగులో దోసగింజలా బొట్టు పాదాలకు పండిన అందల్లా ఎర్రని ముఖమల్ చెప్పల్స్! ఇందిర కొత్తగా కనుపిస్తోంది.

ఆఫీసుకు వచ్చేటప్పుడు మామూలు చీరలతో చాలాసింపుల్‌గా వస్తుంది ఆమె. చెవులకు రింగులు, మెడలో ఒంటిపేట గొలుసు తప్ప ఇంకేమీ వుండవు. ఇప్పుడు ఈ దుస్తుల్లో అలంకరణలో అందాల గృహిణిలా మెరిసిపోతోంది. తనకు దగ్గరగా వచ్చి "రా! అరుణా! ఇన్నాళ్ళకు మా యిల్లు పావనం చేస్తున్నావు!" అంది నవ్వుతూ.

"అంత పెద్ద మాటలు వాడకు! ఆఫీసు గొడవ తర్వాత నాకు సంసార జంఝాటం వుంది కదా?" అంది అరుణ.

డ్రాయింగు రూము దాటి లోనికి వెళ్ళారు. లోపల పెద్ద హాలు. అందులో ఒక మూలగా డైనింగ్ టేబిల్ వుంది. హాలును ఆనుకొని ఇటూ అటూ చెరో రెండు గదులూ వున్నాయి. కుడి వైపున వున్న రెండో గదిలోకి తీసుకు వెళ్ళింది ఇందిర.

"ఇది నా గది! దీనిముందున్న గది నాన్నగారి ఆఫీసు గది! అటువైపువి రెండూ బెడ్‌రూములు. వాటి వెనుక మరో చిన్నరూము వుంది. మా తమ్ముడు అందులో చదువుకుంటాడు. అలా కూర్చో!" అంటూ సోఫాకమ్‌బెడ్ మీద కూర్చోపెట్టి "క్షణంలో వస్తాను. ఇదిగో, ఈ మేగజైన్ చూడు!" అని 'ఫెమినా' ఎదరపడేసి ఫేను వేసి ఇంట్లోకి వెళ్ళింది ఇందిర.

పుస్తకం చేతిలోకి తీసుకుని చుట్టూ కలయజూసింది అరుణ. గది చాలా నిరాడంబరంగా వుంది. గది మధ్యలో మంచం. దాని మీద తెల్లని దుప్పటి పరచి వుంది. కిటికీ ప్రక్కగా అల్మారా నిండా పుస్తకాలు. అవతల పెద్ద అద్దం బిగించిన 'ఛెస్ట్ ఆఫ్ డ్రాయర్స్!' అంతే! గోడకు కనీసం కేలండరయినా లేదు.

లేత పసుపురంగు పెయింటుతో **గోడలు** మిల మిల మెరిసి పోతున్నాయి. గది లోపలి వాతావరణం చాలా హాయిగా అనిపించింది. 'పెమినా' తిరగేస్తున్నా పేజీలమీద దృష్టి నిలబడ్డం లేదు. పుస్తకం ప్రక్కన పడేసి సోఫాలో వెనక్కు జారగిలబడి ఫేను వంక చూస్తూ కళ్లు మూసుకుని వుండిపోయింది.

"అరుణా! రేపు ఉదయం ఆఫీసులో నిద్రపోదువుగాని, ముందు యీ డ్రింక్ తీసుకో! ఈవిడ మా అమ్మగారు! ఈమె నా స్నేహితురాలు అరుణ, మన వీధిలోనే చివర వుంటున్నారు" అన్న ఇందిర మాటలతో కనులువిప్పి, నవ్వుతూ లేచి నిలబడి వాళ్ళ అమ్మగార్కి నమస్కరించింది.

ఆవిడ ప్రతి నమస్కారం చేస్తూ "ఇందిర నీగురించి చెప్తూ వుంటుంది" అని అరుణ నిలబడ్డం చూసి "కూర్చో, ఫర్వాలేదు, నేను వంటలో వున్నాను! మళ్ళా వస్తాను, మీరు మాట్లాడుకుంటూ వుండండి" అంటూ వెళ్ళిపోయింది.

అరుణ డ్రింక్ త్రాగటం ముగించి గ్లాసు ప్రక్కన వుంచింది.

"మా నాన్నగారు ఊరికి వెళ్ళేరు. తమ్ముడు యింకా యింటికి రాలేదు. అందుకని వాళ్ళిద్దర్నీ పరిచయం చెయ్యలేకపోతున్నాను.

ఇదీ మా కుటుంబం" అంది పెద్ద ఆరిందాలా చేతులు అభినయించి చూపుతూ.

అరుణ నవ్వుతూ "ఇందిరా! నువ్వు డేన్సు నేర్చుకున్నావా?" అంది.

"చిన్నప్పుడు నేర్చుకున్నాను. పెద్దయ్యాక మరిచిపోయాను" అంటూ అభినయ ముద్రలో నిలబడి చూపించింది.

"ఇవన్నీ పుస్తకాలే!" అంటూ ఆశ్చర్యంగా అల్మారావంక చూస్తూ అంది.

"ఆహా! అవన్నీ నావే! మా నాన్నగారు ఎక్కువగా చదువుతారు, తక్కువగా మాట్లాడతారు! పుస్తకాలు కొని చదవటం ఆయనకున్న మంచి అలవాట్లలో ఒకటి! తాను చదివిన మంచి పుస్తకాలలో కొన్ని ఏరి, నా గదిలో పడేస్తారు. వాటిని నేను చదువుతాను. నా అల్మారులో అవన్నీ స్థిరంగా వుండిపోతాయి."

ఇందిర అదృష్టానికి మనసులోనే జోహారు లర్పించింది అరుణ.

"ఇంతకీ పర్చేజ్ ఆఫీసరుగారి భార్య అనుగ్రహించిందా?" అంది కొంతసేపు ఆగి.

"ఆహా! నిజంగా ఆవిడ గొప్ప మనిషి. జాకెట్టుగుడ్డ పెట్టి కూతుర్ని అత్తారింటికి పంపినట్లు సాగనంపింది...." అంటూ జరిగిన విషయమంతా చెప్పింది అరుణ.

"మైగాడ్! ఆ ముసలాడికి యిలాటి లక్షణాలు వున్నాయని విన్నానుగాని యింత తెగిస్తాడనుకోలేదు" అంది ఇందిర.

"పోనీలే! దానిగురించి మధనపడటం అనవసరం. నా రోజు బాగుండి బయటపడ్డాను. జీవితంలో ఒక్కొక్క పాఠమూ నేర్చుకుంటున్నాను. ఈవిషయం ఎవరితోటీ చెప్పవద్దని ఆవిడ ప్రాధేయపడింది."

"ఆవిడ మంచితనం వల్లనే యీాయన యిలా ఆటలు ఆడుతున్నాడేమో...."

"అదీ నిజమే కావొచ్చు! దానికేంగానీ.... నువ్వేదో శుభవార్త చెప్తానన్నావు...." అంది అరుణ.

"నేను త్వరలో వివాహం చేసుకోబోతున్నాను" అంది ఇందిర మెల్లిగా. ఆ మాటలు అంటూంటే బుగ్గలు సిగ్గుతో అరుణిమ దాల్చేయి.

"కంగ్రాట్స్! ఇంత ఆలస్యంగానా చెప్పటం? ఇంతకీ ఆ అదృష్టవంతుడెవరు?" ఇందిర ముఖాన్ని తన రెండు చేతులతో పైకెత్తి కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

"అదృష్టం అంతా నాది, ఆయనది కాదు.... పేరు సచ్చిదానంద మూర్తి...."

"ఏంచేస్తున్నారాయన? ఏ వూళ్ళో వుంటున్నారు?.... వివరాలన్నీ చెప్పవేం?" అంటూ తొందరచేసింది అరుణ.

"ఆయన ప్రస్తుతం 'స్టేట్స్'లో వున్నారు. నాకంటె ఎనిమిదేళ్ళు పెద్ద. తల్లీ తండ్రీ ఎవ్వరూలేరు. కులం, గోత్రం ఏమీ తెలియవు. చిన్నతనంలో ప్రేమ సమాజంలో పెరిగేరు. నాన్నగారు ఆయన కాలేజీ చదువుకు సహాయం చేసేరు. నా చిన్నతనంనుండీ ఆయన మా యింటికి రావటం వెళ్ళటం నాకు తెలుసు. తరువాత సైకాలజీలో డాక్టరేట్ చేసి ఉస్మానియా యూనివర్సిటీలో లెక్చరర్‌గా చేరారు. అక్కడినుండి యూనివర్సిటీ ఆయన్ను స్టేట్స్ పంపింది. ఈ నెలలో తిరిగివస్తున్నారు! నేనంటే ఎంతో అభిమానం! అయిదేళ్ళుగా మామధ్య ఉత్తరాలు నడుస్తున్నాయి. ఇదిగో ఆయన ఫోటో!" అంటూ 'ఛెస్ట్ ఆఫ్ డ్రాయర్స్' లోంచి ఓ కలర్ ఫోటో తీసి చూపించింది.

కార్డు సైజులో అందమయిన ఫోటో అది!

మనిషి కాస్త నల్లగా వున్నట్లు అనిపించినా ఆ కనులవెనుక ఎంతో ఔన్నత్యాన్నీ సంస్కారాన్నీ చదవగలిగింది అరుణ. ఒత్తయినజుట్టు, కోలముఖం, అందంగానే వున్నాడాయన!

"వెరీగుడ్! మంచి భర్తనే సంపాదించుకోబోతున్నావు!" అంటూ ఫోటో తిరిగి ఇందిరకు యిచ్చేస్తూ అడిగింది.

"ఇందిరా! మీ నాన్నగారు యీ సంబంధానికి ఒప్పుకున్నారా?"

"లేదు!"

"మీ అమ్మగారో?"

"అమ్మకు అసలే యిష్టంలేదు. కాని యిద్దరికీ చెప్పి ఒప్పించే ప్రయత్నంలో వున్నాను!"

"నీకూ, ఆయనకూ మధ్య యీవిధంగా సంబంధం పెరుగుతోందని మీవాళ్ళకు తెలీదా!"

"అమ్మకు తెలీదు! నాన్నగార్కి తెలుసనుకుంటాను. . కాని బయటపడరు! నామీద ఆయనకు చాలా నమ్మకంవుంది. నేను ఎన్నడూ నా పరిధిదాటి అవలకు వెళ్ళలేదు. మూర్తిగారు కూడా నా విషయంలో ఏనాడూ చెడ్డగా ప్రవర్తించలేదు. ఆయనకు నాన్నగారంటే అమితమయిన అభిమానం, గౌరవం వున్నాయి. ఆయన జీవితంలో నాన్నగారు దీపం వెలిగించారనే కృతజ్ఞత ఆయన మనసు నిండా వుంది. స్టేట్స్ వెళ్ళేముందు మూర్తిగార్కి పదివేలరూపాయల మేరకు హామీ అవసరం అయింది. అప్పుడు ఎవ్వరూ ఆదుకోకపోతే నాన్నగారు ఆయనకు ఆ డబ్బు యిచ్చి హామీ నిలబడ్డారు...." ఇందిర చెప్పటం ఆపి దీర్ఘంగా నిట్టూర్చింది.

"మరి, మీ నాన్నగార్కి మూర్తిగార్ని అల్లునిగా చేసుకునేందుకు యిష్టంలేకపోవటానికి కారణమేమిటి? కులం పట్టింపులు వున్నాయా?"

"ఆయన ఆ విషయం గురించి ఏనాడూ ఆలోచించలేదు. ఆ పట్టింపేవుంటే కులం గోత్రం తెలియని మూర్తిగార్కి సహాయం చేసివుండేవారుకాదు. అయితే మా నాన్నగార్కి ఓ చెల్లెలువుంది. అంటే మా మేనత్త అన్నమాట! ఆవిడకు ఓ కొడుకుపుట్టేక వైధవ్యం ప్రాప్తించింది. మా బావ మెడిసన్ పూర్తిచేసి రాజమండ్రీలో ప్రాక్టీసు చేస్తున్నాడు. నన్ను చేసుకుని సంబంధం కలుపుకోవాలని మా మేనత్తకు కోరికగావుంది. నాన్నగారూ అటే మొగ్గుచూపుతున్నారు. అంతకంటె వేరేకారణం ఏమీలేదు. మా మేనత్తంటే నాన్నగార్కి కూడా ఎంతో ప్రాణం. మా అమ్మకూ

యీ సంబంధమే యిష్టం! బావ మంచివాడే కాని, ముందునుండీ అతనిమీద నాకు ఆ అభిప్రాయంలేదు.''

"అయితే, ఆ సంగతి మీ నాన్నగారితో చెప్పెయ్యక పోయావా?" అంది అరుణ. ఆమెకు ఇందిర చెప్పే సంగతులు వింటూవుంటే సంభ్రమంగా వుంది.

"క్రితం నెలలో చెప్పేను. బాగా ఆలోచించి మరొకనెల పోయాక మళ్ళీ నా నిర్ణయం చెప్పమన్నారు. ఎంతకాలం ఆగినా నా నిర్ణయంలో మార్పు వుండదని చెప్పేను. అయినా నాకుమాత్రం నాన్నగారు టైమిచ్చేరు. ఇందులో కంగారుపడవలసింది ఏమీలేదు. కనుక నేనూ మరోసారి ఆలోచిస్తానని అన్నాను, ఆయన్ను సంతృప్తి పరచటంకోసం! వెంటనే మూర్తిగార్కి స్టేట్స్ ఉత్తరం రాసేను. మొన్న సాయంకాలం ఆయననుండి ఉత్తరం వచ్చింది. వచ్చేనెలలో నేరుగా విశాఖపట్నం వస్తున్నానని రాసేరు. ఇక్కడ నన్ను మేరేజ్ చేసుకుని అప్పుడు హైదరాబాద్ వెళ్ళటానికి వీలుగా ప్రోగ్రాం వేసుకుని వస్తున్నారట. పెళ్ళి అయిపోయాక హనీమూన్ ఎక్కడెక్కడికి వెళ్ళాలో వివరంగా నన్నే ప్లాన్‌చేసి రాయమన్నారు" అంటూ ఆనందంతో చెప్పింది.

"వెరీగుడ్ ఇందిరా! ఇంత మంచిభర్తను పొందబోతున్న నువ్వు చాలా అదృష్టవంతురాలివి. ఒకవేళ మీ నాన్నగారు 'కన్విన్స్' కాక నిన్ను మీ బావకే యిచ్చి వివాహం చేస్తానని పట్టుబడితే....?" అనుమానంగా అడిగింది అరుణ.

"అరూ! నువ్వు నిత్యశంకితురాలివి! చిన్నయసూరి నీతోబాటు మరొక అయిదుగురిని కలిపి, ఈ ఆరుగురూ 'దుఃఖభాగులు' అంటూ ఓ లిస్టు రాసేడు. అన్ని అనుమానాలు, శంకలూ పెట్టుకుంటే మనం ఏ పనీ చొరవగా చెయ్యలేం! నాన్నగారు ఒప్పుకోకపోతే రిజిస్ట్రారు ఆఫీసులో ఆయన్ను వివాహం చేసుకుని వెళ్ళిపోతాను. దట్సాల్!"

అరుణ బాధగా ముఖం పెట్టింది. "ఇందిరా! కన్నవాళ్ళను అంత సులువుగా వదిలెయ్యగలవా? మీ నాన్నగారు వేరే మంచి సంబంధం చూస్తే?...." ఇందిర నవ్వేసింది!

"అరుణా! అందరినీ వదిలి వెళ్ళిపోవటం నాకుమాత్రం యిష్టమనుకున్నావా? అందుకే నాన్నగారిని శాయశక్తులా వొప్పించ టానికి యత్నంచేస్తానని చెప్పేను. అయితే, ఆయన తెచ్చిన సంబంధంమటుకు యింతకంటె మంచిది వస్తుందని యెలా చెప్ప గలం? తెలియని మనిషితో రిస్కు చేయటంకన్న తెలిసిన మనిషిలో లోపాలున్నా అవి సర్దుబాటు చేసుకోవటంలో యెక్కువ సుఖమూ, సంతృప్తీ వుంది. అయినా, జీవిత భాగస్వామిని యెన్నుకునేటపుడు మన యిష్టా యిష్టాలకు యెక్కువ విలువ నిచ్చుకోవాలి కదా! పూర్వపు రోజుల్లో అయితే బాల్య వివాహాలు జరిగిపోయేవి కనుక వయసు, జ్ఞానం పరిణితి చెందేవేళకే 'ఇదిగో, వీడు నీ మొగుడు!' అని చూపించి చెప్తే నోరు మూసుకుని కాపురం చేసేవారు. వాళ్ళకు సుఖంగానే రోజులు వెళ్ళిపోయేవేమో! అది వేరేవిషయం. మనం పూర్తిగా వయసు వికసించేక వివాహం చేసుకుంటున్నాం. ఇందులో మిగిలిన వాళ్ళప్రమేయం కంటె మన స్వంత ఆలోచనే యెక్కువ అవసరం అని నేను భావిస్తాను."

"ఇందిరా! నిన్నుచూసి ఏమో అనుకున్నాను. మొత్తానికి గడుగ్గాయివే! నీ ధైర్యానికీ, ఆలోచనకు మెచ్చుకోకుండా వుండలేక పోతున్నాను."

"ఇహ ఆపవోయ్! మరీ పొగిడెయ్యకు. భుజాలు పొంగి జాకెట్టు చిరిగిపోయేలా వుంది. అయినా నీకు 'ప్రయివేటు క్లాసు' పెట్టేసినట్లున్నాను. ఏమీ అనుకోకు! ఇప్పుడే వస్తానుండు" అంటూ లోనికివెళ్ళి స్వీట్లు, బిస్కెట్లు, మిక్చరు ఒక ప్లేటులోవుంచి తీసుకు వచ్చి అరుణ యెదుట పెట్టింది.

"ఏమిటీ నైవేద్యం? అన్నీ తినటానికే?" అంది.

"కాదు, అవతల పారెయ్యటానికి, తిను! నువ్వొక్కర్తివే కాదు, నేనూ నీకు సాయంచేస్తాను" అంటూ బిస్కెట్టు తీసుకుని కొరికింది.

అరుణ ప్లేటులోంచి స్వీట్ తీసుకుంటూ "అయితే, పెళ్ళి చేసుకున్న వెంటనే ఉద్యోగం మానేస్తావా?" అంది.

"దానిసంగతి నిర్ణయించలేదు. ఆయనతో కలిపి ఆలోచించి ఎలా చెయ్యాలనితోస్తే అలా చేస్తాను. అదిసరే, నేనొక విషయం అడుగుతాను, నువ్వేమీ అనుకోకపోతే!"

"తప్పకుండా అడుగు, నా పెళ్ళిసంగతేనా?" అంది అను మానంగా ఇందిరవంక చూస్తూ.

"అమ్మదొంగా, పోల్చేసేవన్నమాట!"

అరుణ రెండునిమిషాలు ఆలోచనలో పడింది.

జరిగిన సంగతులన్నీ ఇందిరకు చెప్పేసి సలహా అడిగితే బాగుంటుం దనిపించింది. అన్నీ చెప్పటానికి మనసులో బిడియం కూడా బయలుదేరింది. ఎలాచెప్పటం?

మధుమూర్తి విషయం మధ్యలో అడ్డురాకపోతే చిక్కు వుండేదికాదు. ఈ చిక్కు తప్పించాలంటే ఇందిర సలహా తీసుకుని ముందుకు వెళ్ళటం మంచిదనిపించింది. శ్రీకాంత్ ఎలాగూ వారం పదిరోజులవరకూ రాకపోవచ్చు! అతనికోసం ఆగితే ఈలోగా ఈ బంధం మరింత బిగిసేలా కనుపిస్తోంది. మధుమూర్తి మరోసారి యింటికివచ్చి మరిన్ని ఆశలుచూపెడితే తనమీద ఇంట్లో మరింతగా వత్తిడి పెరుగుతుంది. దాన్ని తను తట్టుకోలేదు!!

"సారీ అరుణా! నీకు ఇష్టంలేకపోతే చెప్పొద్దు. బాధ కలిగిస్తే క్షమించు" నొచ్చుకుంటున్నట్లుగా అంది ఇందిర.

"అబ్బే! అదేంలేదు. ఎలా చెప్పటమా అని ఆలోచిస్తున్నాను. అంతే...." అంటూ శ్రీకాంత్‌తో పరిచయం కలిగిననాటి నుండి జరిగిన ముఖ్యమయిన ఘట్టాలన్నీ విశదంగా చెప్పింది. మధుమూర్తి మధ్యలో రావటం గురించికూడా వివరించింది. అరుణ చెప్తున్నంతసేపూ చాలా సీరియస్‌గా వింది ఇందిర. అంతావిని, "ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావ్?" అని అడిగింది.

"అదే తోచడంలేదు. శ్రీకాంత్‌తో చెపుదామనుకుంటే ఊరు వెళ్ళిపోయాడు. నువ్వే సలహా చెప్పాలి!" అంది.

"అరుణా!నీకు శ్రీకాంత్‌మీద అన్నివిధాలా నమ్మకముందా!"

"ఉంది."

"మధుమూర్తికూడా చాలా మంచివాడు, నాకా సంగతి బాగా తెలుసు!" అంది ఇందిర.

"కావొచ్చు!" అంది నిర్లిప్తంగా అరుణ.

"మధుమూర్తిమీద నీకు ఎల్లాటి మోజూలేదా?"

అరుణకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

"ఏమిటా ప్రశ్న? నాకేం మోజులేదు!"

"ఇలా అడుగుతున్నానని బాధపడకు. నిజంగా నీకు మోజు లేకపోతే రేపు సాయంకాలం ఒంటరిగావెళ్ళి మధుమూర్తిని కలుసుకో...."

"కలుసుకొని...." అర్థోక్తిగా ఆగిపోయింది అరుణ.

"కలుసుకొని అతనితో విషయాలన్నీ చెప్పు! నీమీద యింక ఆశలు పెంచుకోవద్దని చెప్పేయ్!"

"ఏమయినా అనుకుంటాడేమో...."

"ఫరవాలేదు. మధు అలాంటివాడుకాదు."

"నేనొక్కతెనూ వెళ్ళి మాట్లాడను!" భయంగా అంది అరుణ.

"మరి నిన్నరాత్రి ఒక్కత్తెవూ అతని గదికి వెళ్ళలేదూ?" ఎగతాళిగా అంది.

"అది వేరేసంగతి. ఆపదలో ఆదుకున్నాక కృతజ్ఞతచెప్పటం కోసంవెళ్ళి అయిదు నిమిషాలు కూర్చున్నాను. అయినా, అలావెళ్ళి చెప్తే ఏమనుకుంటాడో!"

"ఏమనుకుంటాడు? మంచి మనిషి కనుక సంతోషిస్తాడు. ఒకవేళ బాధపడినా నువ్వేమీ చెయ్యలేవు. నీ అనుమానాలన్నీ నిరాధారాలు! అతడు ఏమీ అనుకోడు. జరిగిన విషయాలు అన్నీ అతనితో చెప్పి నీకు, శ్రీకాంత్‌ని తప్ప మరో మనిషిని వివాహం చేసుకొనే ఉద్దేశ్యం లేదనిచెప్పు! అలా అయితే అతడే దూరంగా తొలగిపోతాడు" అంటూ హితవు బోధించింది.

'ఈ విధానం బాగనేవుంది' అనిపించింది అరుణకు. కాని, తనకు తానయివెళ్ళి ఈ విషయాలన్నీ చెప్పగలదా? తప్పదు! ధైర్యం చెయ్యకపోతే చిక్కులన్నీ కోరితెచ్చుకున్న ట్లవుతుంది.

"బాగా ఆలోచించు! ఇది నీ భవిష్యత్తుకు సంబంధించిన విషయం. ఈవేళ నువ్వు తీసుకోబోయే నిర్ణయంమీద నీ జీవితం అంతా ఆధారపడి వుంటుంది!" అంది ఇందిర.

"రేపేవెళ్ళి మధుమూర్తితో చెప్పేస్తాను" అంది ఓ నిశ్చయానికి వచ్చిన దానికిమల్లే.

# 8

మరుసటిదినం ఉదయం బోర్డుదగ్గర కూర్చుని వుండగా పర్చేజ్ ఆఫీసరు అటువచ్చేడు.

"సారీ! నిన్న మిమ్మల్ని రమ్మని వేళకు యింట్లో లేక పోయాను. మీరువచ్చి వెళ్ళారట్టకదా! థేంక్యూ!" అన్నాడు యేమీ తెలియనట్లు.

అరుణ సమాధానంగా "నో మెన్షన్" అంది ఏ భావమూ ముఖంలో చూపించకుండా. అతడు వడివడిగా అడుగులువేసుకుంటూ తన గదివేపు నడిచేడు.

బరువుగా ఊపిరి పీల్చుకుంది అరుణ.

సుమారు పదిగంటల ప్రాంతంలో కాస్తతీరిక చిక్కితే మధుమూర్తికి ఫోన్‌చేసింది. అవతలివైపునుండి "యస్; సేల్స్ ఆఫీస్!" అంటూ ఎవరిదో కంఠం వినబడింది.

"మధుమూర్తిగారు లేరా?"

"లేరు. కేంప్ కెళ్ళారు. మధ్యాహ్నం ఒంటిగంటకొస్తారు! అరుణగారేనా మాట్లాడుతున్నది? నేను టైపిస్ట్ మాలతిని!" అంటూ పరిచయం చేసుకుంది అవతలి కంఠం.

అరుణ గుండెల్లో రాయిపడింది.

మాలతినోరు అసలే మంచిదికాదు!

"మధుమూర్తిగారితో పర్సనల్ విషయం ఏమయినా మాట్లాడాలా!" అవతలినుండి మాలతికంఠం వ్యంగ్యంగా ధ్వనించింది మళ్ళీ.

వెంటనే అబద్ధం ఒకటిపేర్చి చెప్పేసింది అరుణ. "ఆయనకు ఏదో ట్రంకాల్ వచ్చింది...." అని కాస్సేపాగి "....అయినా నాకు ఆయనతో పర్సనల్ విషయాలేముంటాయి?" అంది కాస్త కోపంగా.

"అర్ధరాత్రిపూట ఆయనతో కార్లలో షికార్లుతిరిగే అరుణా! పర్సనల్ విషయాలు నీకుండకపోతే నాకుంటాయా?" కసిగామాట్లాడి ఫోన్ పెట్టేసింది. 'ఛీ! నోటికి ఎంతవస్తే అంతా మాట్లాడెయ్యటమే. ఉద్యోగాలు చెయ్యటానికి నలుగురి మధ్యకొస్తున్నా సంస్కారము మాత్రం అలవడదు!' అనుకుంది అరుణ.

మాలతి ఈ విషయం నలుగురితోనూ చెప్తుంది. అందరి నోళ్ళలోనూ తాను పడక తప్పదు. 'పదిగంటల ప్రాంతంలో తాను అతని కారులో వెళ్ళినందుకు 'అర్ధరాత్రి షికారులు' అనే వరకూ వెళ్ళింది వ్యవహారం. ఇంకా ఎంతదూరం వెళ్తాయో ఈ మాటలు?' అనుకుంది.

'ఎక్ఛేంజ్‌బోర్డు' ముందు కూర్చుని పనిచెయ్యటానికి విసుగ్గా వుంది. మనసునిండా ఆలోచనలే! అన్యమనస్కంగా రెండుగంటల వరకూ గడిపేసింది. రెండుగంటలు దాటేక మళ్ళీ మధుమూర్తి కోసం ప్రయత్నించింది.

"హల్లో! మధుమూర్తి స్పీకింగ్!"

"గుడ్ ఆఫ్టర్‌నూన్! నేను అరుణను."

"హల్లో అరుణా! హౌ ఆర్ యు?"

"డూయింగ్ వెల్! ఈ సాయంకాలం మీతో కొంతసేపు మాట్లాడాలి, వీలవుతుందా?"

"తప్పకుండా! ఎక్కడ కలుద్దాం? మీ ఇంటికిరానా?" అడిగాడు.

అరుణ గాభరాగా అంది. "అప్పే వద్దు. నేనే ఆరున్నర దాటేక మీరూమ్‌కు వస్తాను."

"మీకోసం యెదురు చూస్తూవుంటాను."

"థేంక్యూ! వుంటాను" అంటూ లైన్ డిస్కనెక్టు చేసింది.

తన పేరుతో సంబోధించి మాట్లాడేడు మధుమూర్తి. బైపిస్టు మాలతి ఆ గదిలోనే వుంటుంది. 'ఎదురుచూస్తూ వుంటాను' అన్న మధుమూర్తి మాటలు ఆమె అనుమానాన్ని మరింత బలపరచవచ్చు.

ఇవన్నీ యెందుకిలా జరుగుతున్నాయి?

'ప్రతి చిన్న విషయానికీ భయపడితే ఏమీ సాధించలేం' అన్న ఇందిర మాటలు గుర్తుకొచ్చేయి. తనకు తానే ధైర్యంచెప్పు కుంది. సాయంకాలం మధుమూర్తితో యెలా మాట్లాడాలో రిహా ర్సల్స్ వేసుకుంటూ కాలం గడిపేసింది.

* * *

"ఈ విషయం మీతో యెలాచెప్పాలో అర్థంకావటం లేదు," కాలి బొటనవేలితో నేలమీదరాస్తూ తలదించుకుని అంది అరుణ.

"మీరు యెలాంటి విషయం చెప్పాలన్నా సంకోచించవద్దు. నన్ను మీ ఆప్తమిత్రునిగా భావించండి" తాపీగా అన్నాడు మధుమూర్తి.

అరుణ మెల్లిగా తలయెత్తి అతనివంక చూపింది.

తెల్లచొక్కా, గళ్ళ పైజామాలో చాలా 'రిలాక్సింగ్'గా సోఫాలో కూర్చున్నాడతడు. ప్రక్కనున్న స్టాండ్‌లాంప్ కాంతి అతని ముఖంమీదపడి ప్రస్ఫుటంగా భావాలన్నీ కనిపిస్తున్నాయి. ఆ కన్నుల్లో యెంత నిశ్చలత! మిన్నువిరిగి మీదపడినా చలించని భావం

"నేను విషయమంతా చెప్పేక మీరునన్ను తప్పుగా అర్థం చేసుకోగూడదు," మళ్లీ సంకోచంగా అంది.

ఈసారి సమాధానంగా చిరునవ్వు నవ్వేడు మధుమూర్తి.

"మీకు మరోసారి హామీ యిస్తున్నాను. చెప్పండి...."

"మీరు నన్ను పెళ్ళిచేసు కోవాలనుకుంటున్నారా?"

"అవును."

"ఒకవేళ, మీమీద నాకా అభిప్రాయం లేకపోతే?"

"లేకపోవచ్చు!" ముక్తసరిగా అన్నాడు.

అరుణ సూటిగా అతని కన్నుల్లోకి చూసింది. అతని కన్నులు నవ్వుతున్నాయి.

"నేను మిమ్మల్ని వివాహం చేసుకోలేను, క్షమించండి."

"ఇందులో క్షమాపణల ప్రసక్తి ఏముంది? ఇద్దరి అంగీకారం కుదిరితేనే వివాహం ప్రసక్తి వస్తుంది" చాలా మామూలు ధోరణిలో అన్నాడు.

తరువాత కొంతసేపు అరుణకు ఏం మాట్లాడాలో తోచలేదు.

రెండు నిమిషాల నిశ్శబ్దాన్ని చీలుస్తూ "మీభార్య చనిపోయి యెన్నాళ్ళయింది?" అని అడిగింది.

"మూడు సంవత్సరాలు!"

"అప్పుడే ఆమెను మరిచిపోయారా మీరు?" యీ ప్రశ్న అడగకూడదనే అనుకుంది. కాని నోటి చివరనుండి జారిపోయింది.

"మరచిపోలేదు. 'ఆమె నా గుండెనిండా వుంది' అని సమాధానం చెప్తే మీకు తృప్తిగా వుంటుంది అవునా?" అడిగేడు.

అరుణ మాట్లాడలేదు.

సోఫాలోనుండి లేచి బీరువాతీసి పెద్దఫోటో ఆల్బమ్ అరుణ ఒడిలో పడేశాడు. "అందులో భారతి ఫోటోలున్నాయి చూడండి" అని అటూయిటూ పచార్లు ఆరంభించేడు.

అరుణ పేజీలు తిరగేసింది.

ఫోటోలన్నీ ఎంతో సుందరంగా వున్నాయి. అన్నీ యిద్దరూ కలిసివున్నవే! వాటినిచూస్తే భార్యాభర్తలిద్దరూ యెంతో అన్యోన్యంగా వుండేవారని అనిపించింది. ఆఖరు పేజీలలో బాబుతోసహా మధుమూర్తి, భారతుల ఫోటో.

బాబు బొద్దుగావుండి ముద్దొస్తున్నాడు.

ఆల్బమ్ మడిచి సోఫాలో పెట్టింది.

"అన్నీ చూశారా?" పచార్లు చేస్తూనే, ముఖంలోని భావాలు కనబడనీయకుండా జాగ్రత్త పడుతున్నాడు.

"క్షమించండి, గతాన్ని గుర్తుచేశాను."

"ఫర్వాలేదు. మనసులోంచి పూర్తిగా తీసి పారేసేటంతగా నేను గతాన్ని మరచిపోలేదు. అయితే గుర్తుంచుకుని చేసేదికూడా ఏమీలేదు. నేను జీవితాంతం బాధపడుతూ, అహర్నిశలూ ఆక్రోశిస్తూ కూర్చున్నా చనిపోయిన నా భారతి తిరిగిరాదు. అది నాకు తెలుసు. మీ అందరికీ తెలుసు. అయితే ఆమెపోతూ గుర్తుగా బాబును మిగిల్చిపోయింది. వాడు మా మామగారింట్లో పెరుగుతూ వున్నాడు. కనీస ఆదరణ అయినా వాడికిలేదు. గతాన్ని తల్చుకొని కుమిలిపోతూ నా వర్తమానాన్నికూడా పాడుచేసుకొనలేను. బాబుకు సరయిన పెంపకం కావాలి. మంచి శిక్షణలో వాడు పెరిగి పెద్దవాడు కావాలి. వాణ్ని ఒక బాధ్యతగల మంచి పౌరునిగా తీర్చిదిద్దాలి. అయితే, అది కేవలం నా ఒక్కనివలన సాధ్యంకాదు. వాడిని గుండెల్లో దాచుకుని ప్రేమానురాగాలు అందించి సుశిక్షణలో పెంచే ఆడతోడు కావాలి. అందుకే—మళ్లీ పెళ్లిచేసుకోవా లనుకున్నాను. అయితే కేవలం నా వాంఛలు తీర్చుకునేందుకు అనువుగా వుండే స్త్రీ కోసం నేను ఆరాటపడలేదు. తగిన విజ్ఞానం, సహనం వీటన్నిటినీ సంతరించుకున్న స్త్రీమూర్తి కొరకు యిన్నాళ్ళుగా వెతుకుతున్నాను. సుమారు ఏడాదిక్రితం నేనీ కంపెనికివచ్చి చేరటం బహుశః మీకు గుర్తువుండే వుంటుంది. ఆవేళ రిసెప్షన్ కౌంటరులో కూర్చొని మీరు నన్ను జనరల్ మేనేజర్ గదికి 'డైరెక్టు' చేయటం బాగాగుర్తుంది. ఆనాటినుండీ మిమ్మలను గమనిస్తూనే వున్నాను. మీలోని చాలా గుణాలు నాకు నచ్చేయి. ఈమధ్యనే మీ నాన్నగారిని గురించిన వివరాలు ఆరాతీస్తే అయన చిన్నప్పుడు మా మేష్టారే అని తేలింది. అందుకే చొరవతీసుకుని వచ్చి ఆయనతో మాట్లాడగలిగేను. వీటన్నిటికీమించి చిన్నతనంలోని మనిద్దరి స్నేహం నా ఆలోచనకు మరింతబలాన్నిచ్చింది. మీకు గుర్తులేకపోయినా నాకు అప్పటి చిలిపి చేష్టలన్నీ బాగు గుర్తున్నాయి. నేను రెండో పెళ్ళివాడిననే తేలిక భావం, పెళ్ళాం చచ్చిపోతే మరో ఆడదాని పొందుకోసం తహ తహ లాడిపోతున్న మగాడనే అసహ్యభావం మీ మనసులో నేను

కల్గిస్తే నన్ను క్షమించండి. నా మనసు కొంతవరకూ మీ ముందుంచ గలిగే ననుకుంటాను" తాపీగా మాటలు చెప్పటం ముగించేడు.

మధుమూర్తి తనను యింతకాలంగా ఆరాధిస్తున్నాడా?

తను అతడినిగురించి తేలిగ్గా మాట్లాడినందులకు నొచ్చుకుంది మనసులోనే.

"మీ మనసు గాయపరచటంకోసం నేను మిమ్మల్ని ప్రశ్నించ లేదు. మీ గుండెల వెనుకనుండే బాధ నా కర్థమయింది. కాని నేను యిప్పుడు అశక్తురాలిని! నా మనసు ఏనాడో మరోవ్యక్తికి అంకిత మయి పోయింది."

మనసులోని మాట చెప్పేసి గుండెలమీది పెద్ద బరువును దింపుకున్నట్లు దీర్ఘంగా ఊపిరి పీల్చుకుంది అరుణ.

మధుమూర్తి పచార్లుచేయటం ఆపి కూర్చున్నాడు.

"ఎవరా అదృష్టవంతుడు? నేను తెలుసుకోవచ్చా?"

"మన కంపెనీలో జూనియరు యింజనీరుగా పనిచేస్తున్న శ్రీకాంత్!" మధుమూర్తి ముఖంలోకి చూడలేక తల దించుకుంటూ అంది అరుణ.

"వెరీగుడ్! శ్రీకాంత్ చాలా మంచివాడు! క్రితంసారి సేల్సు ప్రమోషన్ గురించి సెమినార్ జరిగినపుడు ప్లాంట్‌నుండి రిప్రజెంట్ చేశాడతను. అప్పుడు సెమినార్‌లో కలిసేను. చాలా మంచివాడనీ, సిన్సియర్‌గా పనిచేస్తాడనీ విన్నాను. గుడ్ సెలక్షన్ అరుణా!" అన్నాడు.

అతని మాటల్లో తనయెడల యెలాటి కోపమూ ధ్వనించలేదు.

అతడి మంచితనం ముందు అర్థంలేని తన ప్రశ్నలన్నీ యెలా తేలిపోయాయో గుర్తుకువచ్చి సిగ్గుతో ముడుచుకుపోయింది అరుణ.

రెండు నిమిషాల నిశ్శబ్దం తర్వాత "అరుణా!" అంటూ మెల్లగా పిలిచేడు మధుమూర్తి.

తలెత్తి అతనివంక చూసింది.

"అరుణా! మీరెప్పుడూ నాకు స్నేహితులే! ఏదైనా అవుసరం వుంటే నా దగ్గరకు రావటానికి సంకోచించకండి. ఈ చిన్న

అభిప్రాయభేదం వలన మనం శత్రువులం కానక్కరలేదు. నాకు మిమ్మల్ని భార్యగా పొందే అవకాశం లేకపోయినా, కనీసం స్నేహితురాలిగా పదిలపరచుకునే అదృష్టం కల్పించండి. ఈ మధుని మరిచిపోకండి."

అతని గొంతు బరువుగా ధ్వనించింది.

"మీకు నాయెడల వుండే అభిప్రాయానికి కృతజ్ఞురాలిని. మీరు ఎప్పుడూ నాకు స్నేహితులే! నేను వెళ్తాను" అంటూ లేచింది.

"మీ యింటి దగ్గర డ్రాప్ చేయనా?"

"వద్దు. సిటీలో వెళ్తాను" అంటూ బయటకు వచ్చి మేడ మెట్లు దిగి పోర్టికో దాటి రోడ్డుమీదకు వచ్చింది.

"గుడ్ నైట్ అరుణా!" అన్న పిలుపుతో తల ఎత్తి ఎదురుగా వున్న డాబా వంక చూసింది. ఎదురు డాబా మీదనుండి రోడ్డు మీదకు తొంగిచూస్తున్న స్త్రీ మూర్తిని చూసి ఒక్కక్షణం ఆగి పోయింది.

అనుమానంగా ఒక్క నిమిషంపాటు అటే చూస్తూ వుండి పోయింది. "ఇదే మా యిల్లు!" అంటూ ఆ స్త్రీ చెయ్యి గాలిలో వూపుతూ 'టా టా' చెప్పటం మసక చీకటిలో లీలగా కనుపించింది.

ఆ స్త్రీ 'మాలతి' అని కంఠాన్ని బట్టి పోల్చుకుంది అరుణ.

## 9

అరుణ యింటికి వెళ్ళేసరికి అంతా హడావుడిగా వుంది. పక్కింటి రామారావు, పద్మావతమ్మగారు నాన్నగారి గది దగ్గర వున్నారు. అమ్మ తనను చూడగానే "మీ నాన్నగారికి ఏమీ బాగు లేదు. ఊపిరి అందకుండా వుంది. నాకు భయమేస్తోంది. చంద్రాన్ని డాక్టరుగారి దగ్గరకు పంపేను" అంది గాభరాగా.

అరుణకు నిస్సత్తువ ముంచుకొచ్చింది.

తడబడే అడుగులతో తండ్రిదగ్గరకెళ్ళింది. ఆయనకు పూర్తిగా స్పృహలేదు! గుండెలు ఆయాసంతో యెగిసిపడుతున్నాయి. ఊపిరి కోసం పెనుగులాడుతున్నా డాయన.

"నాన్నా!" అంటూ పిల్చింది.

సమాధానంలేదు. నోటినుండి నురగలు రావటం ఆరంభిం చింది. అరుణకు కాలూ చెయ్యీ ఆడలేదు. బిక్కముఖంతో రామా రావు వంక చూపింది.

"ఫరవాలేదమ్మాయ్, డాక్టరుగారు వస్తారు. చంద్రం వెళ్ళి చాలాసేపయింది" అన్నారాయన ఆమెకు ధైర్యం చెబుతూ.

తండ్రివంకే చూస్తూ ప్రక్కనే మంచంమీద కూలబడి పోయింది.

అయిదు నిముషాల్లో డాక్టరుగారువచ్చి పరీక్షచేసి ఏదో యింజె క్షను చేశారు. తరువాత రెండునిమిషాలాగి రామారావుగార్ని పైకి పిల్చి ఏదో మాట్లాడి వెళ్ళిపోయారు.

"ఏమంటారు డాక్టరుగారు?" అడిగింది అరుణ.

"కే. జి. హాస్పిటల్‌లో చేరిస్తే మంచిదంటున్నారు. ఆక్సి జన్ పెట్టాల్సిన అవసరం రావచ్చునట!" అని కొంతసేపు ఆగి, "హాస్పిటల్‌లో చేరుద్దాం! టాక్సీ పిలిస్తే మంచిదేమో?" అంటూ సలహా చెప్పేరు.

అరుణ గుండెల్లో రాయిపడింది.

టాక్సీకి పాతికరూపాయ లవుతుంది. ఇదికాక కనీసం మరో యాభయి రూపాయలయినా దగ్గరవుండాలి. అంతడబ్బు ప్రస్తుతం తనవద్దలేదు. రామారావుకూడా తమలాంటి గృహస్తే! ఆయనవద్ద కూడా చేతిలో డబ్బు లేకపోవచ్చు.

అంతలోనే ఆమె మనసులో మధుమూర్తి మెదిలేడు.

"రామారావుగారూ! శ్రమ అనుకోకపోతే మీకో ఎడ్రస్ చెబుతాను. అక్కడ మా సేల్సు ఆఫీసరుగారున్నారు. ఆయనతో ఈ సంగతి చెప్పండి. ఆయన్ను తీసుకురండి. ఆయనకు కారుంది. మనం నాన్నగారిని తీసుకుని హాస్పిటల్‌కు వెళ్ళొచ్చు" అంది.

"అవునమ్మా! మధుమూర్తికి కబురుచెయ్యి. తప్పకుండా వస్తాడు" అంది తల్లి.

అరుణ మధుమూర్తి చిరునామా వివరంగా చెప్పింది.

"ఇప్పుడే తీసుకు వస్తాను" అంటూ రామారావుగారు బయటకు కదిలేరు.

పద్మావతమ్మగారు అమ్మదగ్గర కూర్చుని ధైర్యం చెబుతూ వుంది. చంద్రం బిక్కముఖం వేసుకుని తల్లిప్రక్కనుండి అరుణ వద్దకువచ్చి "అక్కా! నాన్నకు ఏమీ ప్రమాదం లేదుకదా?" ఏడుపు ముంచుకొస్తోన్న స్వరంతో అడిగేడు.

"ఏమీ ఫర్వాలేదు. మోహన్ ఇంకా ఇంటికిరాలేదా?" అని అడిగింది.

"నాకు కనబడలేదక్కా. ఏ సినీమాకో వెళ్ళిపోయుంటాడు."

"సరే, నువ్వెళ్ళి చదువుకో. నేను యిక్కడ వుంటాలే," అని చంద్రాన్ని అక్కడనుండి పంపేసింది.

ఇరవయి నిమిషాల్లో యింటిముందు కారాగిన శబ్దంవినిపించింది. అరుణ గదిలోంచి బయటకు వచ్చింది.

"మాస్టారికి ఎలావుంది?" అంటూ ప్రశ్నించేడు మధుమూర్తి.

"నేను చెప్పగానే వెంటనే బయలదేరి వోయారు." అంటున్నారు రామారావుగారు.

"మధుమూర్తిగారూ! నాన్నగారికి ఏమీ బాగులేదు. కె. జి. హెచ్‌లో చేర్పించాలి. మీరు కొంచెం సహాయం చెయ్యాలి" అంది.

"నా కారులో తీసుకువెళ్దాం, ఆయనకేం ఫర్వాలేదు. మీరు ధైర్యంగా వుండండి. ఇలా రండి రామారావుగారూ! ఆయన్ను తీసుకువద్దాం" అంటూ లోనికి కదిలేడు మధుమూర్తి.

రెండు నిమిషాల్లో తండ్రి గదిలోంచి యివతలకి వచ్చేడు. అతని వెనుకనే పాలిపోయిన ముఖంతో రామారావుగారు వచ్చారు.

"అయామ్ రియల్లీ సారీ అరుణా! అంతా అయిపోయింది! మీరు కాస్త ధైర్యంగా వుండాలి...." అన్నాడు.

నెత్తిమీన పిడుగులు పడ్డట్లయింది.

మధుమూర్తి మాట్లాడుతున్నదేమీ వినిపించటంలేదు.

అమ్మ గొల్లుమని ఏడుస్తూ కుప్పలా కూలిపోయింది. మెల్లగా అడుగులు వేసుకుంటూ తండ్రిగది గుమ్మంవద్దకు వెళ్ళి నిలబడింది

అరుణ.

తండ్రిలో చలనంలేదు!

ఆయన మరో లోకాలకు వెళ్ళిపోయాడు.

గుమ్మానికి చేరగిలబడి అలాగే గడపమీద కూలబడినట్లు పడి పోయింది అరుణ. తన ప్రక్కనే నిలబడి మధుమూర్తి ఏవో ధైర్యం మాటలు చెబుతున్నాడు. కానీ, ఏవీ మనసుకు పట్టటంలేదు.

ఈ లోటు జీవితంలో ఎన్నటికీ తీరనిది!

మూడుదినాలు బరువుగా గడిచేయి. తండ్రి ప్రేతసంస్కారం నుండి కర్మకాండవరకూ అంతా మధుమూర్తి దగ్గరేవుండి మోహన్ చేత జరిపించాడు. మూడువందల రూపాయలుతెచ్చి అరుణచేతికిచ్చి అవసరాలకు వాడుకొమ్మని చెప్పేడు. జీతాలు వచ్చేక తనకు అప్పు తీర్చవచ్చుననికూడ చెప్పేక అరుణ ఆ సొమ్ము తీసుకొంది. ఆ సొమ్ములో అప్పుడే రెండువందల యాభై రూపాయలు ఖర్చుకూడా అయిపోయాయి.

నాలుగో దినంనుంచి ఆఫీసుకు వెళ్ళటం ప్రారంభించింది.

సుమారు వారందినాల తర్వాత ఓ సాయంకాలం శ్రీకాంత్ వచ్చాడు. అతన్ని చూడగానే అరుణకు దుఃఖం ముంచుకొచ్చింది. భోరున ఏడుస్తూ అతనిదగ్గర కూలబడిపోయింది. "ఏమిటి అరుణా! చిన్నపిల్లలాగా!" అంటూ ఆమెను ఓదార్చేడు శ్రీకాంత్. అతనితో ఏవేవో చెప్పుకోవాలని మనసంతా విప్పి అతనిముందు పరచాలనీ ఎంతో యత్నించింది. కాని, గుండెల్లోంచి ఉబికివచ్చే దుఃఖంమధ్య ఆలోచనలన్నీ కొట్టుకుపోయాయి.

"అరుణా! నువ్వు విశ్రాంతి తీసుకో. వివరంగా సంగతు లన్నీతర్వాత మాట్లాడుకుందాం!" అంటూ వెళ్ళిపోయాడు శ్రీకాంత్.

"ఎవరే అరుణా, ఆ కుర్రాడు? నీతో అంత చనువుగా మాట్లాడుతున్నాడు?" అని అడిగింది జానకమ్మ శ్రీకాంత్ వెళ్ళి పోగానే.

"ఆయన పేరు శ్రీకాంత్. మా కంపెనీలో జూనియర్ ఇంజ నీరుగా పనిచేస్తున్నాడు. నాకు మంచి స్నేహితుడు" అంది పొడిగా.

"ఆహా! మధుమూర్తిగారికంటే ఎక్కువ స్నేహమా అతని తోటి?" అని అడిగింది అదోలా చూస్తూ.

తల్లి అనుమానం అర్థమయింది అరుణకు.

అంతలోనే మోహన్ వచ్చేడు యింట్లోకి.

విషయం మార్చటంకోసం అరుణ మోహన్‌వైపు తిరిగి, "నిన్న వుదయం వెళ్ళిపోయావు. ఇప్పుడా తిరిగిరావటం? ఏం చేస్తున్నావురా?" అని అడిగింది.

మోహన్ అరుణవంక విసురుగాచూసి "ఏం? నీతో చెప్పాలా" అన్నాడు.

అరుణ బిత్తరపోయింది.

తండ్రిపోయిన యింత తక్కువ వ్యవధిలో మోహన్‌నుండి ఈరకం సమాధానం ఊహించలేదు.

"అవునురా చెప్పాలి! ఇల్లు పట్టకుండా ఊళ్ళో బలాదూరుగా తిరిగితే ఈ సంసారం ఏమవుతుందనుకున్నావ్? నువ్వుకూడా నాలుగు రాళ్లు యింటికి తెస్తేగాని సంసారం ఎలాగడుస్తుంది?" అంది కోపంగా.

"నువ్వుపెట్టి పోషిస్తున్నావనేగా యిన్ని మాటలంటున్నావు?" రోషంగా అడిగేడు.

"పెట్టి పోషిస్తున్నందుకు కాదురా! నువ్వు గాడిదలా ఊరు మీద పడి పనీపాటా లేకుండా తిరుగుతున్నందుకు...."

అరుణకు సహనం నశిస్తోంది.

"నువ్వు మాత్రం ఊరుమీద తిరగటంలేదూ! బీచ్‌లోనూ, రోడ్లమీదా నువ్వు శ్రీకాంత్‌గాడితో తిరగటం నేను చూడలేదనుకోకు! ఆ తిరుగుతున్నది చాలక యిపుడు నేరుగా యింటికే రప్పించుకున్నావు. నువ్వాడుతున్న భాగోతం అంతా నాకు తెలుసు" కసిగా అరుణతో అని తరువాత "అమ్మా! నీ కూతురు పతివ్రత అనుకుంటున్నావు కాబోలు. దీని ప్రవర్తన ఏమీ బాగుండటంలేదు. మా స్నేహితులందరి మధ్యా దీనిగురించి నేను తల దించుకోవలసి వస్తోంది" అన్నాడు. అరుణ మ్రాన్పడిపోయింది!!

క్షణంసేపు ఆమెకు ఏం మాట్లాడాలో తోచలేదు.

తల్లి అరుణవంక నిరసనగా చూస్తూ "ఏం? నిజమేనా తల్లీ?" అంది. వచ్చే దుఃఖాన్ని ఆవుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది అరుణ మవునంగా.

"తప్పు తనమీదవుండగా ఏం మాట్లాడగలదమ్మా? కళ్లు మూసుకుని పాలుతాగే పిల్లికి లోకమంతా చీకటిగానే కనిపిస్తుందట. దీనివేషాలు ఎవరికీ తెలియవనుకుంటోంది. మొన్న బీచ్‌లో శ్రీకాంత్‌గాడి వళ్ళో యిది పడుక్కుని వుండగా మా స్నేహితుడు ఒకడు చూశాడట. అందరిమధ్యా నన్ను నిలదీసి అడిదితే నాకు ఒళ్ళు చచ్చిపోయింది...." గట్టిగా అరుస్తున్నాడు మోహన్.

ఆ అరుపులన్నీ చెవుల్లో శూలాల్లా గుచ్చుకుంటున్నాయి అరుణకు. అంతలో తల్లి శోకాలు ఆరంభించింది.

'ఏం మనుషులు వీళ్ళు? వీళ్ళకోసమేనా తను పగలంతా శ్రమపడుతున్నది? వీళ్ళకోసమేనా తాను రెక్కలు ముక్కలు చేసుకుంటున్నది? వీళ్ళనేనా తన సుఖాన్నంటినీ త్యాగంచేసి ఆదుకోవాలనుకున్నది?'

గదిలో మంచంమీద వాలిపోయి కరువుతీరా ఏడ్చింది. తండ్రిని జ్ఞప్తికి తెచ్చుకుని మరీ మరీ ఏడ్చింది!!

'ఈ మూర్ఖుల బాధ్యత నామీదపెట్టి నువ్వు వెళ్ళిపోయావా?' అంటూ రోదించింది. తన రోదన మధ్యలో అమ్మ సణుగుడు, మోహన్ విసుర్లు చెవిని పడుతూనే వున్నాయి.

'శ్రీకాంత్‌గాడు ఒట్టి వెధవ!'....'వాడి కాళ్ళు విరగ్గొట్టించేస్తాను'....అంటూ ఏవేవో మాట్లాడుతున్నాడు మోహన్.

'బంగారంలాటి సంబంధం వస్తే రెండో పెళ్లివాడని కాల దన్నింది. దీని ముఖానికి పెళ్ళి రాసిపెట్టలేదు' అంటూ తల్లి గొణుగుతోంది.

కళ్ళు తుడుచుకుని మంచంమీదనుండి లేచి వరండాలోకి వచ్చింది అరుణ.

"ఏం అరుణా! మోహన్ చెప్పినదంతా నిజమేనా?

మాట్లాడవేం? మీ నాన్నగారు ఎంత గౌరవంగా బ్రతికేరు? ఆయనకు తలవంపులు తెచ్చే పనులు చేస్తావా? ఇలా అయితే, ఆయన ఆత్మకు శాంతి దొరుకుతుందా?" అంది తల్లి.

అరుణ సీరియస్‌గా తల్లివంక చూపింది. "అమ్మా! నాన్నగారి ఆత్మకు క్షోభ కల్గించేపనులుగాని, ఆయన కీర్తికి తలవంపులు తెచ్చే పనులుగాని నేను చెయ్యటంలేదు. శ్రీకాంత్‌తో నాకు స్నేహం వున్నమాట నిజమే! ఈవేళ్టివరకూ ఆతనితో నేను ఏనాడూ హద్దు మీరి ప్రవర్తించలేదు. నేనూ ఆయనా తొందరలోనే పెళ్ళిచేసుకో బోతున్నాం...."

"ఏమిటి? వాణ్ని పెళ్ళిచేసుకుంటావా? నేను ఒప్పుకోను...." మోహన్ కోపంగా అన్నాడు.

"తమ్ముడూ! నేను నీ అంగీకారం అడగలేదు. శ్రీకాంత్‌కూ, నాకూ వుండే సంబంధం గురించి నువ్వు నీచంగా మాట్లాడేవు కనుక యీ విషయం చెప్పేను. ఇది కేవలం నా స్వంతవిషయం. ఇందులో నాకు ఎవరి సలహాలూ అక్కఱలేదు" అంది ఖచ్చితంగా.

"చూసేవా అమ్మా దీనిపొగరు! నాలుగు డబ్బులు తెస్తోందనే కదా దీనికింత అహంకారం! నాన్నపోయాక యింట్లో పెద్ద మొగాణ్ని నేనేకదా, కనీసం నామాటకు విలువ నివ్వనక్కఱలేదూ? సరే, దీని వ్యవహారం నేను చూస్తాను" అంటూ తువ్వాలు తీసుకుని నూతివద్దకు వెళ్లిపోయాడు.

తల్లి కూడా మోహన్ వెనక్కాలే వంటింట్లోకి వెళ్లిపోయింది.

పదినిమిషాల తర్వాత వంటింట్లోంచి పిలుపు వచ్చింది-

"అరుణా! భోజనానికిరా!" అంటూ.

వంటింట్లోకి వెళ్ళింది అరుణ. అప్పటికే భోజనం ముగించి ప్లేట్లో చెయ్యి కడుక్కుని లేచిపోతున్నాడు మోహన్.

కంచం ముందు కూలబడింది అరుణ.

"నేను ఆలస్యంగా వస్తాను. ఆఫీసరుగార్ని కలుసుకునేసరికి ఏవేళవుతుందో?" అంటూ హడావుడిగా బయటకు వెళ్ళిపోయాడు వాడు.

తల్లి వంగి తన కంచంలో కూరవడ్డిస్తూ వుంటే ఆమె మెడ వంక చూపింది అరుణ. ఏదో అనుమానం వచ్చి "అమ్మా! నీ గొలుసేదీ?" అని అడిగింది.

"మోహన్ కిచ్చేను."

"ఎప్పుడు?" గాభరాగా అడిగింది.

"ఈవేళ ఉదయం."

"ఎందుకిచ్చేవ్?"

"ఎవరో ఆఫీసరుగారు ఉద్యోగం యిస్తానన్నారుట. రెండు వందలయాభయి రూపాయలు జీతం వస్తుందిట. అయితే, పదిహేను వందలు లంచం అడిగేరట. గొలుసు అమ్మి యిమ్మన్నాను" అన్నం పళ్ళెం, గిన్నెదగ్గిర పెడుతూ అంది.

"ఎంత పనిచేసేవమ్మా? ఆ మాటలన్నీ నువ్వు నమ్మేవా? ఇచ్చేముందు నాతో ఒక్కమాటయినా ఎందుకు చెప్పలేదు" కోపంగా అడిగింది.

"అది నాకు మీ నాన్నగారు చేయించిన గొలుసు. దాన్ని నా కొడుక్కి యిచ్చుకోటానికి నాకు హక్కులేదా? అయినా, వాడి బాగుకోసం యివ్వటంలో తప్పేముంది?"

"అమ్మా! నీ హక్కుగురించి ప్రశ్నించటంలేదు. ఈ ఇంట్లో ప్రతివస్తువూ నీదికాకపోతే నాదెలా అవుతుంది? కాని దాన్ని యివ్వటంవలన వాడు బాగుపడతా డనుకోవటం మాత్రంకల్ల! దాని వలన వాడు మరింత పాడవుతాడు. వాడు బాగుపడితే నాకుమాత్రం సంతోషం కాదా? నువ్వు ముందుగా నాకీ విషయం చెప్పివుంటే బాగుండేది! అంతే!" అంది బాధగా.

జానకమ్మ సమాధానం చెప్పకుండా మౌనంగా వుండి పోయింది.

అరుణకు భోజనం సహించలేదు.

ఇంట్లో మిగిలిన ఒక్క బంగారు నగా బజార్లోకి వెళ్ళి పోయింది. రేపటినుండి చాటుగా పళ్ళేలు కంచాలు వెళ్ళిపోయినా చేసేదేమీలేదు.

తల్లికూడా మోహన్ మాటల్నే నమ్మి వాణ్ని సమర్థిస్తోంది. పరోక్షంగా వాడి నాశనానికి కారకురాలవుతోంది. ఈ సమయంలో తనేం చెప్పినా చెవికెక్కదు.

కంచం దగ్గరనుండి లేచి గదిలోకి వచ్చేసింది.

చదువుతున్న పుస్తకం గుండెలమీద వుంచుకుని ప్రశాంతంగా నిద్రపోతున్నాడు చంద్రం. మెల్లగా పుస్తకంతీసి అల్మారాలో వుంచి వాడి గుండెలవరకూ దుప్పటీ కప్పింది. 'ఈ ఇంటిని ఆదుకుంటే ఏనాటికయినా వీడే' అనుకుంది.

మరుసటి ఉదయం నిద్ర లేవగానే అడిగింది. "అమ్మా! మోహన్ వచ్చేడా?"

"రాలేదు! రాత్రి వాడిపని పూర్తయిందో, లేదో!" అంది.

అరుణకు తెలుసు! ఆ గొలుసు అమ్మిన డబ్బు ఆర్పేసేవరకూ వాడింటికి రాడు! మాట్లాడకుండా తన మామూలు కార్యక్రమం ముగించుకుని ఆఫీసుకు వచ్చేసింది. పదకొండు గంటల తరువాత శ్రీకాంత్‌కు ఫోన్ చేసింది.

"అరుణా! నిన్ను కలుసుకోవాలి! సాయంకాలం మీ ఇంటికి రానా?" అన్నాడు శ్రీకాంత్.

"వద్దు! వేరే ఎక్కడయినా కలుద్దాం. నీతో చాలా మాట్లాడాలి. బోలెడు విషయాలు చెప్పాలి. లేకపోతే నా గుండె బరువు తీరేలా లేదు. రేపు ఆదివారం కదా! తీరిగ్గా కలుద్దాం. నీకు పనేమైనా వుందా?"

"లేదు! ఫ్రీగానే వుంటాను. ఉదయం బయలుదేరి సింహాచలం వెళ్దామా?" రెండు క్షణాలు ఆలోచించింది.

"సరే! ఉదయం పది గంటలకు సింహాచలంలో వుంటాను. నువ్వు నేరుగా వచ్చెయ్!"

"నాలుగయిదు గంటలు గడిపేలా రా! సాయంకాలం 'చందనా రెస్టు హౌవుస్'లో రూమ్ బుక్ చేస్తాను" అన్నాడు.

"చిన్న పెట్టెతో చీరలూ అవీ తెచ్చుకోనా?" అంది ఎగతాళిగా.

"నువ్వు తెచ్చుకుంటానంటే నాకేం అభ్యంతరంలేదు. ఎందు కయినా మంచిది మరో చీర తెచ్చుకో!"

"ఛీ! పాడుమాటలు! రేపు కలుద్దాం! బై!" అంటూ డిస్కనెక్టు చేసేసింది.

*　　　*　　　*

అరుణ సింహాచలం కొండదిగువ స్టేండులో బస్సుదిగి మెల్లగా నడక ఆరంభించింది. రోడ్డు మలుపుతిరిగి చందనా రెస్టు హౌస్ వైపు సాగిపోయింది. గుట్టపైకి ఎక్కుతూవుంటే ఆయాసం అనిపించింది.

'రెస్టు హౌస్' దగ్గరకు చేరేసరికి ఎదురుగా 'గేరేజ్'లో 'జావా' కనిపించింది.

'అమ్మయ్య! శ్రీకాంత్ వచ్చేదన్నమాట!' అనుకుంటూ వరండా మెట్లు ఎక్కబోయింది.

"అరుణా! ఇలా పైకిరా!" అన్న పిలుపువిని బాల్కనీవైపు చూసింది. శ్రీకాంత్ అక్కడ నిలబడి చెయ్యి వూపుతున్నాడు.

మెట్లెక్కి పైకివెళ్ళింది. పైన వరండాలో రెండు కుర్చీలు వేసి వున్నాయి.

"నువ్వు రాకపోతే ఏం చెయ్యడమా? అనుకుంటున్నాను" అంటూ ఓ కుర్చీలో కూలబడింది. హేండ్ బేగ్‌లోని రుమాలుతీసి చెమట ఒత్తుకుంది.

"అరగంటనుండి నీకోసం ఎదురుచూస్తున్నాను. ఇదిగో ఈ నాలుగో నెంబరు గది మనది. అయిదో నెంబరు గది కూడా ఖాళీయే కనుక ఈ మేడమీదికి ఎవ్వరూరారు. వరండా మనం యధేచ్ఛగా వాడుకోవచ్చును. పన్నెండయ్యేసరికల్లా మనకు లంచ్ తయారుచెయ్యమని కిచెన్‌లో చెప్పి వచ్చాను...." అన్నాడు శ్రీకాంత్.

అరుణ చుట్టూ కలయజూసింది. ఎదురు ఆవరణలోని సంపెంగచెట్టు పువ్వులతో కలకల్లాడుతోంది.

ఆకుపచ్చని ఆకులమధ్య ఎర్రని పూలతో కొత్త పెళ్ళి

కూతురిలా మెరిసిపోతోంది సంపంగి। దూరంగా కొండచరియలో నేలదున్ని అనాసమొక్కలు పెంచుతున్నారు. మెట్లలావున్న వరుసల్లో అనాసపొదలు పచ్చగా కనుపిస్తున్నాయి. వాటికి కుడిప్రక్కగా సంపంగి పొదలు। ఇంకా ఏవేవో పేరు తెలియని వృక్షాలు। కుడి వైపున కొండమీదకు సాగిపోయే రోడ్డు కొంతవరకూ తెల్లగా కనుపిస్తోంది. కొండ అంచుని తాకుతూ తెల్లని మేఘాలు బరువుగా కదిలిపోతున్నాయి. పది గంటల ఎండలో తళ తళ మెరిసిపోతోంది ప్రకృతి।

అరుణ కన్నార్పకుండా ఆ దృశ్యాన్ని చూస్తూ వుండి పోయింది।

శ్రీకాంత్ ఆమె బుగ్గమీద చిటికెవేసే వరకూ ఈ లోకంలోకి రాలేదు.

"అరుణా।" గోముగా పిల్చేడు.

"శ్రీకాంత్। ఎదురుగావున్న దృశ్యం చూడు। ఎంత బాగుందో। నాకిక్కడినుండి కదిలివెళ్లాలని లేదు।"

"కదిలి వెళ్లమని ఎవరన్నారు? ఇక్కడే వుండిపోదాం। గాలి భోజనం చేస్తూ ప్రకృతిని చూస్తూ గడిపేద్దాం? ఏం?" అరుణ ప్రక్కనే నిలబడి సుతారంగా బుగ్గలమీద వేళ్లతో రాస్తూ అన్నాడు.

అతని చేతిమీద తన చేతినివేసి నొక్కుతూ అడిగింది అరుణ.

"శ్రీ। నువ్వెళ్లిన పని ఏమయింది?"

"చెల్లాయి పెళ్ళి నిశ్చయమయిపోయింది. ఇంకో రెండు నెలల్లో ముహూర్తం పెట్టేస్తారు. మనకి అడ్డుతీరిపోతుంది. నాన్న గారితో మన సంగతి చెప్పేశాను. ఆయన అంగీకరించేరు. మళ్ళీ నెలలో మూడు రోజులు నువ్వుకూడా శెలవుపెడితే యిద్దరం కలిసి ఏలూరు వెళ్దాం. అమ్మా నాన్నగారూ నిన్ను చూస్తామని అన్నారు" అన్నాడు.

కొంతసేపు ఆగి "మీ అమ్మకూ, తమ్ముళ్ళకూ అంగీకార మేనా?" అడిగేడు.

"లేదు। వాళ్ళకు ఇష్టంలేదు."

"ఎందుకని?"

"ఎందుకంటే ఏం చెప్పను? నా ఖర్మ బాగుండక!"

"నే నడిగేది ఖర్మ గురించి కాదు—కారణం."

అరుణ శ్రీకాంత్ వెళ్ళిననాటినుండి జరిగన అన్ని విషయాలు వివరించి చెప్పింది. మధుమూర్తి వ్యవహారం, మోహన్ తేలిగ్గా మాట్లాడిన వైనం, మాలతి తనను అనుమానించటం, ఇందిర సలహా అన్నీ చెప్పింది. తండ్రి పోవడం తనను ఎంతగా క్రుంగ దీసిందో కళ్ళనీళ్ళతో కుమిలిపోతూ చెప్పింది.

పావుగంటసేపు ఏకధాటిగా మాట్లాడి కన్నీళ్ళు తుడుచుకుంటూ కుర్చీలో వెనక్కి చేరగిలబడిపోయింది. శ్రీకాంత్ మెల్లగా లేచి వెళ్ళి గది తలుపులు తెరిచి "లోపలకు రా అరుణా! ఇలా మంచం మీద కూర్చుందువుగాని!" అంటూ మంచం మీది దిండ్లు సరిచేసి అరుణను చేతులతో పట్టుకుని నడిపించుకుంటూ తీసుకువచ్చి మంచం మీద కూర్చోపెట్టాడు.

"ఇప్పుడే వస్తానుండు" అంటూ మెట్లు దిగి క్రిందకు వెళ్ళి రెండు కాఫీలు పైకి పట్టించుకు వచ్చేడు.

"కాఫీ తీసుకో!" అంటూ ట్రేలోని కాఫీ ఒకటి ఆమెకు స్వయంగా అందించి రెండోది తాను తీసుకున్నాడు. "తరువాత వచ్చి కప్పులు తీసుకువెళ్ళు" అంటూ బోయ్‌ని పంపేసి గది తలుపులు లోపల గడియపెట్టి ఫేన్ స్విచ్ వేసి అరుణ ప్రక్కకు వచ్చి కూర్చున్నాడు. ఇద్దరూ మౌనంగా కాఫీలు త్రాగటం ముగించేరు.

తరువాత శ్రీకాంత్ జేబులోనుండి ఒక కవరు తీసి అరుణకు అందించేడు.

"ఏమిటిది?" అంటూ ప్రశ్నార్థకంగా అతనివైపు చూస్తూ అందుకుంది.

"చదువు. నీకే తెలుస్తుంది!" అన్నాడు.

లోపలి వుత్తరం తీసి చదవగానే ఆమె ముఖం పాలి పోయింది.

పెదాలు భయంతో వణికేయి. 'తన ప్రవర్తన మంచిదికాదనీ

మధుమూర్తితో నీచమయిన సంబంధం తనకు వుందనీ' అందులోని సారాంశం. ఉత్తరం ఇంగ్లీషులో టైపు చేయబడి వుంది. క్రింద సంతకం లేదు.

"శ్రీ! నువ్వీ విషయం నమ్ముతున్నావా?" వచ్చే ఏడుపు ఆపుకుంటూ అడిగింది.

"ఈ విషయంలో నా నమ్మకం ప్రసక్తి ఏమీ లేదు. నేను నమ్మేను కాబట్టి నీకు ఈ ఉత్తరం చూపించటమూ కాదు. సంజాయిషీ కోసం అంతకంటె కాదు. పనిచేసే ఆడవాళ్ళమీద ఈ రకం అభాండాలు పడటం ఈ సమాజంలో మామూలే! అనవసరంగా నలుగురి నోటా పడకుండా మనం పెళ్ళిచేసుకోవటం మంచిది."

అరుణకు 'ఈ వుత్తరం ఎవరు వ్రాసి వుంటారా?' అనే అనుమానం వచ్చింది. అంతలో మాలతి గుర్తుకు వచ్చింది.

అవును! నిశ్చయంగా ఆమె పనే ఇది!

మాలతికీ తనకూ విరోధం లేదు. కాని ఆమెకు తన విషయాలు కావాలి. ఒకళ్ళ జీవితాలలో ఇలా చిచ్చు రగిలిస్తే వాళ్ళకు ఒరిగేదేమిటో తెలీదు. 'అదో రకం నైజం' అనుకుంది.

"తప్పకుండా ఈ పని మాలతిదే!" అంది ఉక్రోషంగా.

"ఈ ఉత్తరం ఎవరు వ్రాశారన్నది అప్రస్తుతం అరుణా! నువ్వు మిగిలిన వాళ్ళ దృష్టిలో చులకన అవుతున్నావన్నది గమనించాలి. ఈవేళ మాలతి! రేపు మరో జానకి! ఎవరో ఒకరు వ్రాస్తారు. పరోక్షంలో గుసగుసలాడుకుంటారు. వాళ్ళకు ఆ అవకాశం ఇవ్వటం మంచిదికాదు. నిన్ను నమ్మక ఇంకెవర్ని నమ్మను అరుణా?" అంటూ ఆమె భుజాలమీద మృదువుగా రాసేడు.

"శ్రీకాంత్! నేను చాలా అదృష్టవంతురాలిని!" అంటూ అతని గుండెల్లో తన ముఖాన్ని దాచుకుంది. శ్రీకాంత్ వెచ్చని చేతులు రెండూ అరుణ భుజాలమీద, మెడల వెనుక అనునయంగా కదిలేయి. ఆమె పెదాలు అతని వక్షంతో గుసగుసలాడేయి. రెండు నిమిషాల తర్వాత శ్రీకాంత్ మంచం మీదకు ఒరిగి అరుణను సుతారంగా తన ప్రక్కకు లాక్కున్నాడు.

"శ్రీ! నాకేదో భయంగా వుంది!" అంటూ మెల్లగా గొణిగింది.

"అరూ! నువ్వు నాకు కావాలి!" అంటూ ఇంక ఆమెను మాట్లాడనీయకుండా తన పెదాలతో ఆమె పెదాలను గట్టిగా మూసేశాడు. ఎత్తయిన ఆమె గుండెల్ని తన వక్షానికి బలంగా అదుముకుంటున్నాడు.

అరుణకు ఒడలంతా మత్తెక్కిపోతోంది. ఏవో తీయని లోకాలలో విహరిస్తున్నట్లుంది ఆమెకు. ఓ పదినిమిషాలపాటు నిర్వచించలేని తీయని బాధ తప్ప ఏమీ తెలియలేదు.

మత్తుగా కనులు విప్పి చూసింది. అలసిన ముఖంతో చిరునవ్వు చిందించే పెదాలతో తన వంకే గుచ్చి గుచ్చి చూస్తున్నాడు శ్రీకాంత్. మళ్ళీ కనులు మూసుకుంది అరుణ!

# 10

సుమారు పది రోజులు గడిచిపోయాయి.

ఓ దినం కౌంటరులో వుండగా మధుమూర్తి పలకరించేడు.

"అరుణా! ఓ ట్రావెలింగ్ ఏజెంట్స్ ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం ఖాళీగా వుంది. ఆ మేనేజరు నాకు స్నేహితుడే! మీ తమ్ముడికయితే బాగుంటుంది, ఏమంటావ్?" అన్నాడు.

"మోహన్ ప్రస్తుతం ఊళ్ళోలేడు. ఎక్కడికి పోయాడో కూడా తెలీదు. వాడికి బొత్తిగా స్థిరం లేదు. మా చంద్రానికి ఆ పోస్టు వచ్చేలా చూడండి. చదువు మాన్పించి అందులో చేరుస్తాను. తరువాత ప్రయివేటుగా పరీక్షలకు చదువుతాడు. ఈ సహాయం చేస్తే మీ ఋణం తీర్చుకోలేను!" అంది.

"సరే! రేపు సాయంకాలం చంద్రాన్ని నా గదికి పంపించు" అని వెళ్ళిపోయాడు. మధుమూర్తి మంచితనానికి మనసులోనే జోహారు లర్పించింది.

వారం రోజుల్లో చంద్రానికి 'మిలాప్ ట్రావెల్ ఏజెంట్స్' కంపెనీలో గుమాస్తాగా ఉద్యోగం వచ్చింది. మొదట్లో నెలకు నూట ఎనభై ఇవ్వటానికి ఆరు నెలల తర్వాత పనినిబట్టి జీతం పెంచటానికి

ఒప్పందమయింది. చంద్రం ఆఫీసుకు సక్రమంగా వెళ్ళివస్తున్నాడు. రాత్రిపూట పరీక్షలకు చదువుకుంటున్నాడు. అరుణకు పెద్ద బరువు గుండెలమీదనుండి దింపుకున్నట్లయింది.

ఒకనాటి సాయంకాలం ఆఫీసునుండి తిరిగి వెళ్ళిపోతూ వుంటే ఇందిర కలిసింది.

"అరుణా! స్టేట్స్ నుండి మూర్తిగారు నిన్ననే వచ్చారు. ఎల్లుండి రిజిష్ట్రారు ఆఫీసులో మా వివాహం జరుగుతుంది. నాన్న గారు కూడా అంగీకరించేరు. మూర్తిగార్కి మా పెళ్ళి నిరాడంబ రంగా జరగాలని కోరిక! మా పెళ్ళికి ఎవర్నీ పిలవటంలేదు. అమ్మ నాన్నగారు, తమ్ముడు నాతో వస్తారు. అంతే! నేను రేపటినుండి శెలవు ఎప్లయి చేశాను. మా హనీమూన్ ట్రిప్పు పూర్తి అయ్యేక వైజాగ్ వచ్చి ఉద్యోగానికి రిజైన్‌చేసి హైదరాబాద్ వెళ్ళిపోతాను" అంటూ గడగడా విశేషాలన్నీ వల్లించింది.

"మెనీమెనీ కంగ్రాట్స్ ఇందిరా!" అంది సంతోషంతో అరుణ.

"అప్సరాకు వెళ్ళి కాఫీ త్రాగి అప్పుడు ఇంటికి వెళ్దాం! ఈ శుభసమయంలో నేనే నీకు పార్టీ యిస్తాను."

ఇందిర వద్దంటున్నా వినకుండా బలవంతంగా తీసుకువెళ్ళి అప్సరాలో పార్టీ యిచ్చింది అరుణ.

"ఇవన్నీ ఎందుకు అరుణా!" అంది ఇందిర.

"నీ దగ్గర నేను ఎన్నోమాట్లు కాఫీ త్రాగేనులేవోయ్! నువ్వింత మంచివార్త చెప్పినందుకు నన్నొకసారి బిల్లు ఇవ్వనియ్! ఇలాగయినా నీ ఋణం కొంత తీర్చేసుకుంటాను" అంది అరుణ.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ జగదాంబ సెంటరు వరకూ నడిచి వచ్చేరు. "ఇందిరా! నువ్వు హనీమూన్ పూర్తి చేసుకుని వచ్చేవేళకు నా పెళ్ళి కూడా నిశ్చయమయిపోవచ్చు. అమ్మ ఒప్పుకోకపోయినా నేను ప్రొసీడ్ అయిపోతాను" అంది.

"విష్‌యూ గుడ్‌లక్!" అంది ఇందిర.

పదమూడో నెంబరు బస్సు వస్తే ఇద్దరూ ఎక్కేశారు.

* * *

రిజిష్ట్రారు ఆఫీసులో ఇందిర వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది. పెళ్ళి అయిన మరుసటి దినమే ఇందిరా, మూర్తి బెంగుళూరు బయలుదేరారు. వాళ్ళను సాగనంపటానికి అరుణ స్టేషనుకు వెళ్ళింది. మూర్తిగారు ఎంతో సౌమ్యంగా కనుపించేరు. అరుణను చాలా ఆదరంగా పలుకరించేరు. "ఈ హనీమూన్ ట్రిప్పు అయిపోయాక మేం హైదరాబాద్ వెళ్ళిపోతాం. అప్పుడు మీరు ఇంటికి వచ్చి నాలుగు రోజులు మా ఇందిరతో గడిపి వెళ్ళాలి!" అంటూ ఆహ్వానించేరు. అరుణ చిరునవ్వుతో థేంక్స్ చెప్పింది.

ట్రయిను వెళ్ళిపోయాక స్టేషను గేటు దాటి బయటకువస్తూంటే మోహన్ కనిపించాడు. అరుణను చూడగానే గబగబా వెళ్ళిపోవాలని ప్రయత్నించేడు.

"మోహన్!" అంటూ గట్టిగా పిల్చింది.

చర చరా నడిచిపోతున్నవాడల్లా మూడో తరగతి విశ్రాంతి హాలు బెంచీల దగ్గర ఆగిపోయాడు.

అరుణ త్వరితంగా నడిచి వాడి వద్దకు వెళ్ళింది.

వాడిని ఆ స్థితిలో చూడగానే అరుణకు దుఃఖం ముంచు కొచ్చింది. వాడి చొక్కా, పంట్లాం మాసిపోయి వాసనేస్తున్నాయి. జుట్టు సంస్కారం లేక తాటి టెంకమల్లే అసహ్యంగా తయారయి వుంది. మాసిపోయిన గెడ్డం, లోతుకుపోయిన కళ్ళు, హఠాత్తుగా చూస్తే గుర్తు పట్టలేనంత దీనంగా మారిపోయాడు.

"తమ్ముడూ! ఎక్కడున్నావురా ఇన్నాళ్ళూ?" అని అడిగింది. మోహన్ని ఆ స్థితిలో చూసేసరికి ఆమె కోపమంతా మంచులా కరిగిపోయింది.

మోహన్ మాట్లాడలేదు.

వాడి చేతులమీదా, ముఖం మీదా వాతలు పెట్టినట్లు గుర్తు లున్నాయి,

"ఏమిట్రా ఈ దెబ్బలన్నీ? ఎందుకిలా అయిపోయావ్? ఊళ్ళో వుండి కూడా ఇంటికి రాకుండా తిరుగుతున్నావేమిటి?" అని ఎన్నో ప్రశ్నలువేసింది. అన్నిటికీ వాడినుండి ఒక్కటే సమాధానం.

అది మౌనం!

"పోనీ, నువ్వేమీ చెప్పొద్దులే! ఇంటికి వస్తావా?" అని అడిగింది.

వస్తానన్నట్లు తల అంగీకారసూచకంగా ఆడించేడు.

"పద! రిక్షాలో వెళ్దాం!" అంది వాడి చెయ్యి పట్టుకుంటూ.

"వద్దు! నీతో రాను! రెండు రూపాయలు వుంటే ఇవ్వు! నేను వేరే వస్తాను."

అరుణ దీర్ఘంగా నిట్టూర్చి బేగులోంచి రెండు రూపాయలు తీసి వాడికిచ్చింది.

"తొందరగా వస్తావు కదూ! అమ్మ నీ కోసం చూస్తోంది."

"వస్తాను!" అంటూ చరచరా నడిచి వెళ్ళిపోయాడు మోహన్.

అరుణ బయటకు వచ్చి రిక్షా బేరమాడి ఇంటికి వచ్చేసింది.

"అమ్మ! నీ సుపుత్రుడు కనిపించేడు స్టేషనులో!" అంది ఇంట్లోకి వస్తూనే.

"ఏడీ! ఇంటికి వచ్చేడా? రమ్మని చెప్పలేదా నువ్వు?" అంది జానకమ్మ.

"ఎందుకు చెప్పలేదు? నాతో రావటానికి నామోషీ అయింది! రెండు రూపాయలు కావాలన్నాడు, ఇచ్చేను. వేరే రిక్షాలో వస్తానన్నాడు. నాకేమో అనుమానంగానే వుంది. వాడి వ్యవహారం చూస్తే ఇంటికి వచ్చేలా కనిపించటం లేదు."

"వాడి వుద్యోగం సంగతి ఏమీ చెప్పలేదా?"

అరుణ నిరసనగా తల్లివంక చూసింది.

"ఇంకా నీకు ఆశ పోలేదన్నమాట! నీ మెడలో గొలుసు పట్టుకుపోయి అమ్మేసి తాగి తందనాలాడి ఏ పేకాటలోనో డబ్బులన్నీ ఆర్పేశాడు. ఏ యే వూళ్ళు తిరిగేడో తెలీదు. ఒంటినిండా వాతలు, దెబ్బలు మటుకు వున్నాయి. వాడేదో గవర్నరు గిరీ చేస్తాడన్న ఆశ ఇంకా నీకు చావలేదన్న మాట!" అంది తీవ్రంగా.

"నా కడుపు కోత నీకెలా అర్థమవుతుందే తల్లీ! పాడవు

తున్నాడని వదిలేసుకుంటామా? తెగతెంపులు చేసుకుంటే పోయే బంధమా? నువ్వు వాణ్ని నీ తమ్ముడిగా మరిచిపోయినా, నా కడుపున పుట్టినందుకు నాకు తప్పదుకదా!" అంటూ శోకాలు ఆరంభించింది.

తల్లి మూర్ఖత్వం చూస్తే అరుణకు చికాకు కలిగింది. 'తండ్రి చనిపోయాక ఈవిడకు చాదస్తం, మొండితనం మరీ ఎక్కువయి పోయాయి' అనుకుంది.

"కడుపు తీపికొద్దీ వాడికి డబ్బిచ్చి పాడుచెయ్యి! ఇంట్లో వున్న సామాన్లన్నీ బజారులోకి నడిచి మనం రోడ్డుమీద పడితే, అందరం కలిపి ముష్టెత్తుకోవచ్చు!" అంది కోపంగా.

"మీ నాన్నగారు పోయాక నీ నోటికి మరీ హద్దులేకుండా పోతోంది...." అంటూ ముక్కు చీదుకుంటూ వంటింట్లోకి వెళ్ళి పోయింది జానకమ్మ! పోతూ పోతూ మరోమాట కూడా విసి రింది "నీకు కష్టంగా వుంటే చెప్పు! నేనూ ఇంట్లోంచి వెళ్ళి పోతాను!" అని.

అరుణకు ప్రాణం చివుక్కుమంది! మాట్లాడకుండా గదిలోకి వెళ్ళి మంచం ఎక్కేసింది.

* * *

మరునాడు ఆఫీసులో బోర్డుదగ్గర కూర్చొని వుండగా, సేల్సు ఆఫీసు అటెండరు గురుమూర్తి కనుపించేడు. ఏనో కాగితాలు పట్టు కొని వెళ్తున్నాడు. "మీ అయ్యగారు కేంప్ వెళ్ళారా?" అంటూ మధు మూర్తిని గురించి యధాలాపంగా ప్రశ్నించింది.

వాడు క్షణం ఆగి "మీ కీ వార్త తెలీదా?" అని అడిగేడు.

అరుణ ఆశ్చర్యంగా "ఏమిటి?" అంది.

"మధుమూర్తిగారు రాజీనామా చేసేరు. కారణం యేమిటో తెలీదు. నిన్న మధ్యాహ్నం ఆయన ఎకౌంట్లు అన్నీ 'క్లియర్' చేసుకుని కంపెనీనుండి రావల్సిన డబ్బు తీసుకుని వెళ్ళిపోయారు! నిన్నరాత్రి ఆయన అద్దెకుండే ఇల్లుకూడా ఖాళీ చేశారుట. రాజీనామా చేసేవరకూ మా కెవ్వరికీ తెలిదు!" అన్నాడు.

ప్రయివేటు కంపెనీలలో రాజీనామాలు నిమిషాలమీద జర

గటం కొత్తకాదు. పై అధికారులతో తగవులు వస్తే రాజీనామా చేయించటం, ఆమోదించటం క్షణాల్లో జరిగిపోతుంది. కాని తనకు తెలిసినంతలో మధుమూర్తికి అలాటి విరోధాలు ఎవరితోనూ లేవు. ఆయన వచ్చేక సేల్సుకూడా బాగా పెరిగింది! ముఖ్యంగా ఆయన క్రిందవున్న రెండు జిల్లాలలోను కెమికల్స్ బాగా అమ్ముడుపోతున్నాయని రోజూ వచ్చే లాబరేటరీ ఆర్డర్లే చెప్తున్నాయి. అంతేకాదు త్వరలోనే ఆయనకు ప్రమోషన్ రావొచ్చనని 'టాక్' వుంది.

"కారణం యేమిటో తెలీదా?" తన ఆదుర్దాను అణుచుకోలేక గురుమూర్తిని అడిగింది.

"అది తెలిస్తే యింకేం కావాలి?" అని కాస్సేపాగి "మళ్ళీ మాట్లాడతాను! ఈ కాగితాలు అర్జెంటుగా మేనేజరుగారి కివ్వాలి!" అంటూ వెళ్ళిపోయాడు.

'మధుమూర్తి ఎందుకు రిజైన్‌చేశాడు? పరోక్షంగా అందుకు తనే కారణమా? అతడు తాను లేనిదే బ్రతకలేనంతగా తనను ఆరాధిస్తున్నాడా? లేక ఇంకేదైనా కారణమా?'

అరుణ మనసులో యెన్నో ఆలోచనలు ముసురుకున్నాయి. 'వెళ్ళేముందు తనతో ఒక్క-మాటయినా చెప్పలేదు' అనుకుంది కొంతసేపు. కాని అంతలోనే అనిపించింది 'ఎందుకు చెప్పాలి! అతని వల్ల తాను సహాయం పొందిందే కాని తనవల్ల అతడు ఏమాత్రం సహాయం పొందలేదు. నిజానికి తనే యెంతో ఋణపడి వుంది. ఒకటో తారీఖున తీర్చెయ్యాలనుకున్న మూడువందల రూపాయల్లో కానీ కూడా బాకీ తీర్చలేదు.'

ఆలోచనల మధ్య సతమత మవుతూ లంచ్ వరకూ గడిపేసింది.

లంచ్ సమయంలో పోస్టులో ఉత్తరం వచ్చింది. కవరు చింపి, ఆత్రుతగా బయటకు తీసింది. అది మధుమూర్తి రాసిన ఉత్తరం!

"డియర్ అరుణాదేవిగారూ!

నేను నా ఉద్యోగానికి రాజీనామా చేశాను. అన్నీ

'సెటిల్' చేసుకుని ఈ రాత్రికే మా వూరు వెళ్ళిపోతున్నాను. ఇందుకు కారణాలు చాలావున్నాయి. అవన్నీ మీతో ఏకరువు పెట్టి మిమ్మల్ని విసిగించదలుచుకోలేదు. మా బాబును మామ గారింటినుండి తీసుకువెళ్తున్నాను. వాడు ఇకమీదట నా సంరక్షణలోనే పెరుగుతాడు. మా గ్రామంలో భూములు, కొబ్బరితోట వున్నాయి। తోట మధ్యలో ఒక పాత యిల్లు వుంది। ప్రస్తుతానికి అదే నా నివాసం. అక్కడ కొంత ప్రశాంతత దొరుకుతుందని వెళ్ళిపోతున్నాను. మీ భవిష్యత్తు అదృష్టమయం కావాలని ఆశిస్తాను. మీ రెప్పుడూ ఓ మంచి స్నేహితురాలిగా నా మదిలో వుంటారు। నా కివ్వాల్సిన డబ్బు గురించి బాధపడకండి। నాకు ఆ మాత్రం ఋణపడటంలో తప్పులేదు।

మీ

మధుమూర్తి।"

ఉత్తరం నాలుగయిదు పర్యాయాలు చదువుకుంది.

'అక్కడ కొంత ప్రశాంతత దొరుకుతుందని వెళ్ళిపోతున్నాను' అన్న వాక్యం అరుణను మరీ కదిలించింది. అంటే ఇక్కడ ప్రశాంతత లేదా? ఇంతకాలం వున్న ప్రశాంతత తనవల్ల భగ్నమయిందా?! అయితే, మధుమూర్తి రాజీనామాకు తనే కారణం అవుతుంది. వెళ్ళిపోయేలోగా తనకు చేయగల్గిన సహాయం చేసి మరీ వెళ్ళిపోయాడు మధుమూర్తి. అది చంద్రానికి ఉద్యోగం వేయించటమే। తనంత తానుగా అడిగి మరీ చేశాడు. అతని ఋణం తాను యెలా తీర్చుకో గలదు? మనసంతా కృతజ్ఞతతో నిండిపోయింది—అతని యెడల।

ఆ తరువాతి ఆదివారం సాయంకాలం రామకృష్ణా బీచ్‌లో శ్రీకాంత్‌ను కల్సింది.

"అరూ! జావా యెక్కు! 'సన్ అండ్ సీ'కి వెళ్దాం....!" అన్నాడు.

"వద్దు! ఇక్కడే యిసకలో కూర్చుందాం!" అంది.

"నాకు ఆకలిగా వుంది. ఈ మధ్యాహ్నం ప్లాంట్‌లో 'బ్రేక్

డౌను' వచ్చింది. సరిగ్గా భోజనం చెయ్యలేదు. టిఫిన్ చేద్దాం! రా!" అన్నాడు బండి స్టార్టు చేస్తూ.

అరుణ వెనకాల యెక్కి కూర్చుంది.

నాలుగు నిమిషాలలో యిద్దరూ హోటలుకు చేరుకున్నారు. బయట లాన్‌లో వున్న 'కేన్' కుర్చీల్లో కూర్చున్నారు. హోటలు చాలా ఖాళీగా వుంది. 'లాన్'లో దూరంగా రెండుజంటలు కూర్చొని డ్రింక్స్ తీసుకుంటున్నారు.

దూరాన కొబ్బరిచెట్లు! ఆవల ఉవ్వెత్తుగా లేచి పడుతున్న సముద్ర కెరటాలు! ఎడంవైపుగా స్విమ్మింగ్‌పూల్‌లో ఇద్దరు చిన్న పిల్లలు ఈత నేర్చుకుంటున్నారు.

బేరర్ వచ్చేడు!

"అరూ! టిఫిన్ ఏం కావాలి?"

"నాకేమీ వద్దు! కూల్‌డ్రింకు తీసుకుంటాను! నువ్వు టిఫిన్ తీసుకో!"

"మొహమాట పడకు....!" అన్నాడు శ్రీకాంత్ చిరునవ్వుతో.

"మరే! అదే యెక్కువయిపోయింది. మొన్న సింహాచలం వెళ్ళి వచ్చిన నాటినుండీ మరీ మొహమాటంగా వుంది" అంది కొంటెగా శ్రీకాంత్‌వంక చూస్తూ.

"యూ సిల్లీ!" అని మెల్లగా అంటూ ఆమె కాలి బొటనవేలి మీద తన కాలివేలితో నొక్కేడు.

"వెజిటబుల్ కట్‌లెట్ తీసుకురా! తరువాత రెండో గోల్డు స్పాట్!" అన్నాడు.

బేరర్ వెళ్ళిపోయాడు.

"అరుణా! మళ్ళీ ఆదివారమే మా చెల్లాయిపెళ్ళి. నేను శుక్రవారం బయలుదేరి వెళ్తాన్నాను. నువ్వుకూడా ఆ సమయంలో వస్తే బాగుంటుంది. మా వాళ్ళందరికీ ఒకసారి పరిచయం చేసినట్లవుతుంది. ఏమంటావు!" అన్నాడు.

"అలాగే! ఈలోగా నేను అమ్మతో ఈ విషయం మాట్లాడు

తాను. ఆమె కాదంటే నీతో వచ్చెయ్యటమే! అంతే! మళ్ళీ ఆ ఇంట్లో అడుగుపెట్టటం జరగదు. చంద్రం కాస్త అందివచ్చాడు కదా! అమ్మని తనే పోషిస్తాడు!"

"వెరీ గుడ్...! నువ్వు ఆ మాత్రం సాహసిస్తే చాలు!" అన్నాడు.

బేరర్ తెచ్చిన టిఫిన్ తిని డ్రింక్స్ పూర్తి చేశారు.

తల్లికి యీ సంగతి యెలా బోధపరచాలో ఆలోచించుకుంటూ వుండిపోయింది అరుణ.

మరునాడు మధ్యాహ్నం ఒంటిగంటకు రద్దీగా వున్న సమయంలో ప్లాంటునుండి ఫోన్ వచ్చింది.

"హల్లో!....హల్లో...." అంటూ గాభరాగా వుంది అవతలి కంఠం!

"చెప్పండి!....యేం కావాలో!...." అంటూ విసుక్కొంది అరుణ.

"ప్లాంట్ మేనేజరుగారు ఆయన రూములో దొరకటంలేదు. ఎక్కడ వున్నారో కాస్త వెతకండి....ఆయన్ని అర్జెంటుగా ప్లాంటులోనికి రమ్మని చెప్పాలి!... ఇక్కడ పెద్ద 'ఏక్సిడెంటు' జరిగింది.... ప్లీజ్....క్విక్!..." అంటూ ఫోను పెట్టేశారు.

అరుణ ఫోన్‌మీద అన్ని మేనేజర్స్ గదులూ వెదికింది.... చివరకు కాన్ఫిడెన్షియల్ మీటింగులో వున్నట్టు తెలిసింది. ఫోన్‌లో దొరికేసరికి మరో అయిదునిమిషాలు పట్టింది.

"సార్! మిమ్మల్ని అర్జెంటుగా ప్లాంటుకు రమ్మంటున్నారు. ఏదో ఏక్సిడెంటు జరిగిందట!" అంది అరుణ.

"మైగాడ్! ఓకే? నేను వెళ్తున్నాను!" అంటూ ఫోన్ పెట్టేశాడాయన.

అరుణకు గాభరాగా వుంది. ఏక్సిడెంటు యేమిటో? యేం జరిగిందో? అవతలి కంఠంలోని ఆదుర్దా చూస్తే పెద్ద ప్రమాదమే జరిగినట్లు అనిపిస్తోంది. శ్రీకాంత్ ప్లాంట్‌లోనే వున్నాడు. అతనికి యేమీ కాలేదు కదా?!

అంతలోనే 'ఛా! ఏమిటీ పాడు ఆలోచనలు!' అనుకుంది. ఎంత కంట్రోలు చేసుకుందామనుకున్నా మనసులో చెడ్డ ఆలోచనలే ముసురుతున్నాయి.

ప్లాంటుకు డయల్‌చేసి "ఏక్సిడెంటు యెలా జరిగింది?" అని అడిగింది.

ఎవరో ఆపరేటింగ్ టెక్నీషియన్ ఫోన్ యెత్తేడు. " 'టర్బయిన్' ఓవరు స్పీడుకు వెళ్ళి షేఫ్టు విరిగి ముక్కలయింది. ఆ దగ్గరలో పని చేస్తున్న జె. ఇ. శ్రీకాంత్‌కీ హెల్పర్ శివయ్యకీ బాగా దెబ్బలు తగిలేయి. ఇద్దరినీ అంబులెన్సులో హాస్పిటల్‌కు పంపించారు!" అంటూ ఫోన్ పెట్టేశాడు ఆవలి వ్యక్తి.

అరుణకు కాలూ చెయ్యీ ఆడలేదు!

ప్లాంట్ కాల్ డిస్కనెక్టు చేయటం కూడా మరిచిపోయి అలా కొయ్యబారినట్లు వుండిపోయింది రెండు నిమిషాలు!

హాస్పటల్‌కు తీసుకువెళ్ళేరంటే పెద్ద దెబ్బలే అయివుండాలి? పది నిమిషాలవరకూ యేవో పిచ్చి పిచ్చి ఆలోచనలు మనసులో ముపిరేయి.

మళ్లీ ప్లాంటుకు ఫోన్‌చేసి అడిగింది. "శ్రీకాంత్ ప్రాణానికి ముప్పులేదు కదా!"

"ప్రాణానికి ఫర్వాలేదు! కాని గట్టి దెబ్బలే తగిలేయి" అంటూ సమాధానం వచ్చింది.

ఆఫ్ డే లీవు పెట్టి హాస్పిటల్‌కు వెళ్ళాలని సీటులోనుంచి లేచింది.

కాని ఆఫీసు మేనేజరు విశ్వనాథంగారు ఆ ప్రయత్నం సాగనివ్వలేదు.

"మధ్యలో బోర్డు వదిలిపోతే ఎలాగ? అయినా, నువ్వు హాస్పిటల్‌కు వెళ్ళి యిప్పుడు చేసేదేముంది? సాయంకాలానికి అతడు కొంచెం తేరుకుంటాడు. డ్యూటీ అయిపోయాక వెళ్దువుగాని. నువ్వు గాభరాపడటం తప్ప అక్కడవాళ్ళకు చేసే సాయం ఏమీ వుండదు. ఏక్సిడెంటు జరిగినట్లు శ్రీకాంత్ తండ్రికి టెలిగ్రాం యిచ్చాం!"

అన్నారు.

నాలుగు గంటలవరకూ ఎలా గడిచిందో తెలీదు. ఆఫీసునుండి సరాసరి కె. జి. హెచ్.కి చేరుకుంది. వార్డు కనుక్కొని వెతుక్కుంటూ లోనికి వెళ్ళింది. స్పెషల్ రూంలో ఒక మంచంమీద శ్రీకాంత్, మరోదానిమీద శివయ్య వున్నారు.

శ్రీకాంత్‌కు ముఖంమీద చాలాచోట్ల చిన్నచిన్న గాయాలు తగిలేయి. కడుపుమీద బేండేజ్‌లా కట్టి వుంది. నిండా రక్తం మరకలు; ఒంటిమీద తెలివిలేకుండా పడి వున్నాడు.

శ్రీకాంత్ స్నేహితులు, ఇతర అఫీసర్లూ రూమ్‌లోవున్నారు. అతడిని ఆ స్థితిలో చూస్తే దుఃఖం ముంచుకొచ్చింది అరుణకు. అంతలో విశ్వనాధంగారుకూడా వచ్చేరు.

అరుణ పరిస్థితి గమనించి మెల్లగా అన్నారు. "ఏమీ ఫరవా లేదు! వారంరోజుల్లో ఒడ్డున పడతాడు."

అప్పుడే శ్రీకాంత్‌ను పరీక్షించి వచ్చిన డాక్టరు వెనుకే బయటకు వచ్చి అడిగింది అరుణ. "డాక్టర్! అతని ప్రాణానికి ఏమీ ముప్పులేదు కదః"

ఆమె స్వరం వణికింది.

"ఆయన మీకు ఏమవుతారుః" అడిగేడు డాక్టర్.

"ఆయన... నాకు.... స్నేహితులు....త్వరలో ఇద్దరం పెళ్ళి చేసుకోబోతున్నాం...." అంది.

"సో సారీః ఆయన కడుపులో ఇంకా ఒక వుక్కుముక్క వుండిపోయింది. దాన్ని ఆపరేట్ చేసి బయటకు తియ్యాలి. స్పెషలిస్టుకు కబురు వెళ్ళింది. ఇంకో అరగంటలో ఆయన వస్తారు. ఆయన చూస్తేగాని ఏ సంగతీ చెప్పలేం. బహుశ ప్రాణానికి భయం వుండదు. కానీ మళ్ళీ మనుషుల్లో పడటానికి రెండు నెలలుపైగా పట్టవచ్చు!" అంటూ వెళ్ళిపోయాడు ఆయన.

హాస్పిటల్ వరండా గోడకు చేరగిలబడి అలాగే అచేతనంగా వుండిపోయింది అరుణ. పది నిమిషాల తర్వాత కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చేసింది.

ఆ రాత్రి తెల్లవార్లూ నిద్ర సరిగ్గా పట్టలేదు. నిద్ర నిండా పీడకలలే! క్షణ క్షణం శ్రీకాంత్ పరిస్థితి గురించి ఆదుర్దాయే!

అర్ధరాత్రి సమయంలో ఎవరో కుదిపివేసినట్లయింది. కళ్లు విప్పి చూసింది.

చంద్రం ప్రక్కనే నిలబడి వున్నాడు!

"ఎందుకు అక్కయ్యా! ఏడుస్తున్నావు?" అని అడిగేడు.

తనకు వచ్చిన కల జ్ఞప్తికి వచ్చి వణికిపోయింది అరుణ. చంద్రాన్ని కౌగలించుకుని గట్టిగా ఏడ్చింది.

"ఛా! ఏమిటి అక్కా! చిన్నపిల్లలాగ!" అంటూ అనునయించేడు చంద్రం.

"ఏదో పీడకల వచ్చిందిరా!" అంటూ మెల్లగా మాట మార్చి "నువ్వు పడుక్కో!" అంటూ వాణ్ని ప్రక్కమీదకు పంపేసింది.

కొంతసేపు మోకాళ్లలో తలదూర్చి మౌనంగా చూస్తూ వుండిపోయింది.

శ్రీకాంత్‌కు ఏమైనా జరిగితే తన గతేమిటి?

తను బ్రతగ్గలదా?!

గుండెల నిండా గుబులు! మెదడునిండా వెర్రి ఆలోచనలు!

ఎలా తెల్లవారిందో తెలీదు!

పక్కమీదనుండి లేచేసరికి తల దిమ్ముగా వుంది.

ముఖం కడుక్కొని కాఫీ త్రాగి చీర మార్చుకుంది!

"అక్కా! ఇంత ఉదయాన్నే యెక్కడికే వెళ్తున్నావ్?"అని అడిగేడు చంద్రం.

"శ్రీకాంత్‌కు నిన్న ఫేక్టరీలో ఏక్సిడెంటు జరిగింది. చాలా గట్టిగా దెబ్బలు తగిలేయి. హాస్పిటల్‌లో వున్నాడు. ఒకసారి వెళ్ళి చూసి రావాలి!" అంది.

చంద్రానికి—నిన్నరాత్రి అక్కయ్య ఎందుకేడ్చిందో అర్థమయింది. మెల్లగా అరుణ వద్దకు వచ్చి "అక్కా! నేనూ రానా?" అని అడిగేడు.

అరుణ ఒక్క క్షణం ఆలోచించి "సరే! రా!" అంది. ఇద్దరూ రిక్షా యెక్కి హాస్పిటల్‌కు చేరుకున్నారు.

హాస్పిటల్ ముందు ఆవరణ దాటి వార్డులోకి అడుగు పెడుతూ వుంటే అరుణ కాళ్లు వణికేయి. మెల్లగా స్పెషల్ రూము వైపు వెళ్ళింది.

రూము బయట వరండాలో ఇంజనీర్లు, ప్లాంట్ మేనేజరూ వున్నారు. వాతావరణంలో యేదో స్తబ్ధత కనుపించింది. గుండెలు దడదడ కొట్టుకున్నాయి అరుణకు.

మెల్లగా నడచుకుని రూమువద్దకు వెళ్ళి రెండుక్షణాలు ఆగి పోయింది. శ్రీకాంత్ బెడ్‌కు మూడువైపులా తెల్లని 'స్క్రీన్' అడ్డం పెట్టి వుంది.

ప్రక్కనుండి విశ్వనాథంగారి మాటలు వినిపించేయి. "ఆప రేషను జరిగేక రాత్రి ఒంటిగంటవరకూ బాగానే వున్నాడు. అంత లోనే మళ్లీ పరిస్థితి విషమించింది. రెండుగంటలకు పోయాడు?....మీ అక్కయ్యను యిలా బయటకు తీసుకురా బాబూ!...." ఇంకా ఏదో చెప్తున్నాడాయన చంద్రంతో.

కుప్పలా నేలమీద కూలిపోయింది అరుణ!

తెలివొచ్చేసరికి హాస్పిటల్ బెడ్‌మీద వుంది. చుట్టూ కలయ జూపింది అరుణ. తల్లి, చంద్రం మంచం ప్రక్కన వున్నారు.

"ఎలావుంది అరుణా?" అంటూ ముఖం దగ్గర పెట్టి అడిగింది జానకమ్మ!

అరుణ మాట్లాడలేదు!

సమాధానం చెప్పాలంటే నీరసంగా వుంది. వాంతి వచ్చే టట్లుగా అనిపించింది. కడుపులో ఒకటే త్రిప్పు! నరాలన్నీ పీకుగా వున్నాయి!

భరించలేని నిస్సత్తువ!

తలమీద యెవరో సమ్మెటలతో మోదుతున్నట్లు బాధ!

అంతలో డాక్టరు దగ్గరగా రావటం గుర్తుంది! ఆవిడ ఏదో ఇంజెక్షన్ ఇచ్చింది! తరువాత మగత నిద్రలోకి జారిపోయింది

అరుణ।

మరుసటిదినంవరకూ ఆమె పరిస్థితి అలాగేవుంది. తెలి వొచ్చేక చంద్రాన్ని అడిగింది. "శ్రీకాంత్‌కు ఎలావుంది?"

"అక్కయ్యా! నువ్వు కొంచెం ధైర్యంగా వుండాలి. అమ్మ నీ పరిస్థితి చూసి బెంగపెట్టుకుంది. శ్రీకాంత్ వాళ్ళ నాన్నగారూ, అమ్మగారూ వచ్చేరు. శవాన్ని టాక్సీలో తీసుకుని ఏలూరు వెళ్ళిపోయారట!" అన్నాడు చంద్రం మెల్లిగా.

రెండు చేతులతో ముఖం కప్పేసుకుని బావురుమంటూ ఏడ్చేసింది అరుణ. చంద్రం ఎంత యత్నించినా ఆమెను వారించ లేకపోయాడు. అక్కయ్య పరిస్థితి చూస్తే చంద్రానికి భయంవేసింది.

నాలుగు దినాల తర్వాత కొస్త తేరుకుని యింటికి వచ్చింది అరుణ। కంపెనీకి పదిహేను దినాలకు శెలవు చీటి పంపించింది. ఈ నాలుగు రోజుల్లోనూ ఆమె పూర్తిగా చిక్కిపోయింది. తిండి దగ్గర కూర్చుంటే మెతుకు దిగటంలేదు. పిచ్చిదానికి మల్లే మంచం మీద కూర్చొని శూన్యంలోకి చూస్తూ గంటల తరబడి గడిపేస్తోంది. పేపరు చదవాలన్నా, పుస్తకం చదవాలన్నా దేనిమీదా దృష్టి నిలబడటంలేదు? ఏ పనిచేయాలన్నా ఉత్సాహంలేదు! మనసంతా ఒకటే దిగులు!

శ్రీకాంత్ లేనికొరత తన జీవితానికి ఎలా తీరుతుంది?

అతడు లేని జీవితం ఎలా గడపటం?

ఈమధ్యనే ఆమెకు మరొక కొత్త విషయం మనసులోకి వచ్చింది.

తనలో శ్రీకాంత్ రూపం పెరుగుతోందనే అనుమానం।

అస్పష్టంగా అది తనకు తెలుస్తోంది।

ఒకరోజు ఆత్మహత్య చేసుకోవాలనిపించింది। కాని ధైర్యం చాలలేదు। తన జీవితంమీద తనకు అధికారం వుండొచ్చు! కాని తనలో పెరుగుతున్న ప్రాణి సంగతి?

కాని, తాను ధైర్యంగా ఆ జీవిని భూమ్మీదకు తీసుక రాగలదా? తరువాత సమాజంలో తనగురించి వినబడే గుసగుసల్ని

తాను తట్టుకోగలదా?

మనసులో తుదిమొదలు లేని ఆలోచనలు!

పెట్టిన శెలవు గడువు అయిపోతే మరో పదిహేను దినాలు పొడిగించింది.

ఓ దినం సాయంకాలంవేళ హఠాత్తుగా ఇందిర వచ్చింది. "అరుణా! వెరీసారీ! నీకు చాలా అన్యాయం జరిగిపోయింది. నీకు సానుభూతి ఎలా చెప్పాలో కూడా నాకు తెలియటంలేదు!" అంటూ వచ్చి ఇందిర ప్రక్కన మంచంమీద కూలబడిపోయింది.

అరుణకు ఏడుపురాలేదు! ఏడ్చి ఏడ్చి కళ్ళన్నీ పొడారి పోయాయి.

అందుకే పేలవంగా నవ్వింది!

"ఇందిరా! ఇంక నాకు జీవితంలో ఏమీ మిగల్లేదు. అది నా దురదృష్టం! అంతే!" అంది పొడిగా. ఇందిరను చూశాక కసీసం యీమాత్రం మాట్లాడాలనిపించింది. ఇంతవరకూ నోరు విప్పి ఒక్కమాటయినా యింట్లో మాట్లాడలేదు.

"అరుణా! ఉద్యోగంలో చేరిపోకూడదూ! కొంత కాలక్షేపం అవుతుంది. ఇంటిదగ్గర కూర్చుంటే యీ బాధ మరిచిపోవటం మరింత కష్టం!" అంది.

"లాభంలేదు ఇందిరా! పదిహేనురోజుల తర్వాత వెళ్లాలను కున్నాను కాని మెంటల్‌గా అందుకు సిద్ధమవలేకపోయాను. అందుకే మళ్ళీ శెలవు పొడిగించేను. ఎప్పటికీ నేను ఆఫీసుకు వెళ్ళలేనేమో! అసలు యీ వాతావరణంలోనే బ్రతకలేననిపిస్తోంది. ఎక్కడికయినా వెళ్ళిపోవాలి, ఈ జనానికి దూరంగా!"

"అరూ! కొంతకాలం ఆగి ఏదైనా మంచి సంబంధం చూసుకుని పెళ్ళిచేసుకో!" మెల్లగా అంది ఇందిర.

తేలిగ్గా నవ్వేసింది అరుణ. "నాకూ శ్రీకాంత్‌కూ మానసికంగా, శారీరకంగా ఏనాడో వివాహం జరిగిపోయింది...."

"అంటే?...." అర్థంకానట్లు చూసింది ఇందిర.

"రెండునెలలక్రితం యిద్దరం ఓరోజు సింహాచలం వెళ్ళాం!

అక్కడ కొంచెం తొందర పడ్డాం!....ఇప్పుడు శ్రీకాంత్ రూపం
నాలో ఎదుగుతోంది....” శూన్యంలోకి చూస్తూ చెప్పింది.

“మైగాడ్!” అంటూ మూడు నిమిషాలు మాట్లాడకుండా వుండిపోయింది ఇందిర.

తరువాత అడిగింది మెల్లిగా “అరూ! మధుమూర్తి యీమధ్య కనుపించేడా?”

“లేదు! ఆయన రిజైన్‌చేసి వెళ్ళిపోయి చాలాకాలమంది.”

“రిజైన్‌చేసి వెళ్ళిపోయాడా? ఎందుకని? ఎక్కడకు వెళ్ళేడు?”

“ఎందుకు చేసేడో చెప్పలేదు! వాళ్ళగ్రామం వెళ్ళిపోయాడు అదెక్కడో నాకు తెలీదు! ఆయన చిరునామా కూడా ఇవ్వలేదు. ఇదిగో, ఈ ఉత్తరం మాత్రం రాసేరు....” అంటూ మంచం దిగి లేచివెళ్ళి అలమారాలోంచి ఉత్తరంతీసి ఇందిరకు యిచ్చింది. ఆ ఉత్తరం చదివి దీర్ఘంగా నిట్టూర్చి తిరిగి యిచ్చేసింది.

“అరుణా! నువ్వేం చేద్దామనుకుంటున్నావ్? నువ్వు మనుషుల్లోకి రావాలి! ఇలా వుండిపోతే మరీ పిచ్చెత్తిపోతుంది!” అంది ఇందిర.

“ఈ వాతావరణానికి సాధ్యమయినంత దూరంగా వెళ్ళిపోదా మనుకుంటున్నాను” అంది అరుణ ఏదో నిశ్చయాన్ని వచ్చినదానిలా మల్లే.

“నువ్వెళ్ళిపోతే నీవాళ్ళందరూ ఏమయిపోతారు?”

“చంద్రం చేతికి అందొచ్చేడు కదా! అమ్మని వాడే పోషించు కుంటాడు. మోహన్ సంగతంటావా? నాకు నమ్మకంలేదు—వాడి రాత ఎలావుంటే అలా జరుగుతుంది! ....”

“ఎక్కడకు వెళ్దామని నీ ప్రయత్నం?”

“అరవిందాశ్రమానికి!”

ఇందిర కొంతసేపు మౌనంగా వుండిపోయింది. తరువాత “ఈ వయసులో ఆశ్రమానికా?” అంది.

“అవును! అక్కడికి కాని లేదా వేరే ఆశ్రమానికి దేనికైనా

రవే! నిర్మలంగా మనసులుండే చోటుకు వెళ్ళాలి! నేను కోరుకునే ప్రశాంతత నాకు లభ్యం కావాలి. ఇంకో రెండు మూడు నెలల్లో లోకుల దృష్టిలో నేను శీలం చెడిన మనిషిగా కనబడతాను. నాకు పుట్టబోయే బిడ్డకు కూడా సంఘంలో ఏమాత్రం విలువా వుండదు! అందుకని యిక్కడినుండి వెళ్ళిపోవాలి త్వరగా!" చాలా నిశ్చయంగా మాట్లాడింది అరుణ.

"ఎప్పుడు బయలుదేరుతున్నావ్?" నిట్టూరుస్తూ అడిగింది ఇందిర.

"ఎల్లుండి మధ్యాహ్నం మెయిలుకి!"

"మీ అమ్మగారితో యీ సంగతి చెప్పేవా?"

"లేదు! చెప్పదల్చుకోలేదు!"

"సరే! విష్ యూ ఆల్ ది బెస్ట్!" అంటూ మంచంమీద ండి లేచి అరుణ చెయ్యి ఆప్యాయంగా నొక్కి "ఎల్లుండి లుస్తాను" అంటూ వెళ్ళిపోయింది.

* * *

రైలు వేగంగా పరుగెడుతోంది! రెండో తరగతి బోగీలో టికీ ప్రక్కసీట్లో కూర్చుని వెనక్కు జారగిలబడి ఆవలి దృశ్యాన్ని ూస్తోంది అరుణ.

సాయంకాలం నాలుగు దాటిపోయింది. ఎండ బాగా పల్చ డింది. ఒకటి రెండు తెల్లమబ్బులు అలవోకగా కదిలిపోతున్నాయి లాకాశం క్రింద! టెలిఫోను తీగలమీద తీరిగ్గా కూర్చొని కాడిస్తున్న కత్తెరపిట్టలు, దూరంగా చిన్న చిన్న పొదలు అన్నీ నక్కు కదిలిపోతున్నాయి.

అరుణ మనసులో అర్థం తెలియని దృశ్యాలు మెదిలి ుక్కలుగా తెగి మాయమవుతున్నాయి!

తన హైస్కూలు చదువు—ఆనాటి స్నేహితురాళ్ళు-వాళ్ళతో వ అల్లరి, చిలిపిచేష్టలు—తను పెద్దమనిషయిన నాడు యింట్లో ోడావుడి—చిమ్మిలి పేరంటం—కాలేజీలో చేరిననాడే ఓ కుర్రాడు ంపట్టుకులాగి అల్లరిచేస్తే ఏడ్చి నలుగురిలో నవ్వులపాలవటం—

బియ్యే చదువుతున్న రోజుల్లో శ్రీకాంత్‌తో సాన్నిహిత్యం—విహా
రాలు—ఇందిరతో స్నేహం—మధుమూర్తి తన జీవితంలో ప్రవే
శించటం—తండ్రి మరణం—మోహన్‌తో దెబ్బలాడిన రోజులు—
శ్రీకాంత్‌తో తాను గడిపిన మధురమయిన రోజు—శ్రీకాంత్
మరణం—అన్నీ సినీమా రీళ్లలా తిరిగిపోయేయి అరుణ కనుల
ముందు!

గతంలో ఎన్ని మధుర స్వప్నాలు కందో?!

ఇంకెన్ని కడవల కన్నీళ్లు కార్చిందో?!

ప్రక్కనున్న ముసలామె "ఎంతవరకూ వెళ్తారమ్మా?" అని అడగటంతో యీ లోకంలోకి వచ్చింది అరుణ. ఏదో ఒక సమాధానం ఇవ్వాలని "విజయవాడ" అంది.

"చూడమ్మా! నేను నిడదవోలులో దిగిపోతాను. స్టేషన దగ్గరకు వస్తోంది. ఈ పెట్టె కిటికీలోంచి అందిస్తావా?" అని అడిగింది.

"అలాగే!" అంటూ పెట్టె అందుకుంది అరుణ. తన సూట్ కేసు వుందో లేదో అని ఎదుటి బెర్తుమీద ఓమారు చూసింది!

మెయిలు నిడదవోలు ప్లాట్‌ఫారం మీద ఆగింది.

ముసలావిడ ప్లాట్‌ఫారం మీదకు దిగి కిటికీవద్దకు వచ్చి పెట్టె అందుకుని వెళ్ళిపోయింది. గార్డు విజిల్ ఊది పచ్చజండా చూపిస్తున్నాడు. జనం మధ్యలో పరిచయమయిన ముఖం కనిపి... ఆశ్చర్యంగా అటే చూస్తూ వుండిపోయింది! అతడు మధుమూర్తి ప్రతి పెట్టెలోకీ తొంగిచూస్తూ పరుగెడుతూ ముందుకు వస్తున్నాడు.

అంతలోనే అరుణను చూసి "అరుణా! నీ సూట్ కేసు సామాన్లు యిలా యివ్వు!"

"ఎందుకు?" అంది అరుణ.

"చెప్తాను! సామాను యిలా కిటికీలోంచి అందివ్వు! రైలు కదుల్తోంది!" అంటూ హడావుడిచేసి, ఆమె కిటికీలోంచి అందించిన సూట్ కేసు నేలమీదపెట్టి "నువ్వు అలా తలుపు దగ్గరకురా! క్విక్!" అంటూ అరిచేడు.

అరుణ తడబడే అడుగులతో ద్వారం వద్దకు వెళ్ళింది.

మధుమూర్తి గట్టిగా ఆమె చేతులు పట్టుకుని "దిగు" అంటూ ప్లాట్‌ఫారంమీద కదిలే రైలుతోబాటు వేగంగా నడుస్తున్నాడు.

"నేను దిగను! నన్ను వెళ్ళనివ్వండి!" అంది అరుణ. 'సూట్‌కేసు ఆ కంగారులో ఎందుకిచ్చినా?' అని మధనపడింది.

"ప్లీజ్ అరుణా! తొందరగా దిగు! లేకపోతే నీతోబాటు నేనూ పరుగెడుతూ రైలుక్రింద పడాల్సి వస్తుంది! ప్లీజ్!" అన్నాడు. రైలు బాగ వేగం పుంజుకుంటోంది!

తాను దిగనంటే రైలుతోబాటు పరుగెత్తి క్రిందపడేలా వున్నాడు మధుమూర్తి.

రైలు దిగేసింది అరుణ! ఆమె పడిపోకుండా రెండు చేతులతో ఆమె భుజాలు పొదివి పుచ్చుకున్నాడు మధుమూర్తి!

"అమ్మయ్యా!" అంటూ ఊపిరిపీల్చుకుని క్షణంసేపు నిలబడి పోయాడు.

"రా! అరుణా! ఇంటికివెళ్దాం!" అంటూ వెనక్కు వచ్చి సూట్‌కేసు అందుకున్నాడు.

అరుణ అతని దగ్గరగా వెళ్ళి "నన్నెందుకు దింపేరు?" అని అడిగింది కందిపోయిన ముఖంతో. "రా! ఇంటిదగ్గర మాట్లాడు కుందాం! ఇక్కడ ప్లాట్‌ఫారంమీద బాగుండదు!" అన్నాడు.

ఇద్దరూ బయటకు వచ్చేరు.

కారు డిక్కీలో సూట్‌కేసు పడేసి తాను స్టీరింగ్‌ముందు కూర్చుని ఫ్రంట్‌డోర్ తెరిచి "ఎక్కు" అన్నాడు! అరుణ ఎక్కింది!!

కొంతసేపు యిద్దరిమధ్యా మౌనం!

కారు ఊరి పొలిమేరలు దాటి మలుపుతిరిగి మరో తారురోడ్డు పట్టింది.

"అరుణా! ఎక్కడికి నీ పయనం?"

"ఏమో నాకే తెలీదు!" నిర్లిప్తంగా అంది.

"ఆశ్రమానికి వెళ్దామనుకున్నావా?"



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M110 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |